# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

## పురుషులు

సూత్రధారి
ఇంద్రుడు
షణ్ముఖుడు
దూర్వాసుడు
బ్రహ్మ
విష్ణువు
శంకరుడు
పాత్రధారి విష్ణువు
పాత్రధారి శంకరుడు
సింధులుడు (రాజు)
బుద్ధిసాగరుడు (ప్రధాని)
బ్రాహ్మణులు
ముంజుడు (రాజు)
పౌరులు (రైతులు)
వత్సరాజు (ప్రధాని)
దైవజ్ఞుడు (యోగి)

భోజుడు (రాకుమారుడు)
పురజనులు
మాయావి (మాంత్రికుడు)
అబ్బయ్య (కాళిదాసు)
సుబ్బయ్య (కాళిదాసు తండ్రి)
అచ్చిగాడు (యెరుకు)
సత్యవంతుడు (రాజు)
నీతివంతుడు (ప్రధాని)
మృదంగం, తారంగం, సారంగం — బడిపిల్లలు
అప్పలశాస్త్రి (బడిపంతులు)
శంకరకవి (పండితుడు)
ఏకసంత గ్రాహి, ద్విసంత గ్రాహి, త్రిసంత గ్రాహి — ఆస్థానకవులు

## స్త్రీలు

నటి
సరస్వతి
సావిత్రి
లక్ష్మి
పార్వతి
మాయాసుందరి

మోహిని
సావిత్రి (రాణి)
అచ్చి (యెరుకు)
సర్వమంగళ (రాకన్య)
కాళికాదేవి

# —[ కథాసంగ్రహము ]—

అమరేంద్రుని యాహ్వానంబున, భరతమహాముని విరచితంబైన మాయాసుందరి విజయమను నాటక ప్రదర్శనమునకు, సకలదేవతాముని బృందము స్వర్గములో సమావేశమగుట, అందులో స్త్రీలకు వశ్యులుగాని వారీరేడులోకంబులలో లేరని, విష్ణుపాత్రయు, జితేంద్రియులైనవారిని, కేవలచపలచిత్తులగు స్త్రీలు యేమియు చేయలేరని శంకరపాత్రయు, వారిరువురిలో వాద ప్రతివాదము లధికరించుట, శంకరు నోడించుటకు విష్ణువు మోహినిరూపము దాల్చుట, దూర్వాసుడు సరస్వతిని భూలోకంబున మూగవాడవుగా నుండుమని శపించుట, సావిత్రిదేవి, దూర్వాసుని స్త్రీగాజన్మించి నదే మూగవానిని గట్టుకొమ్మనిశపించుట, బ్రహ్మయు భోజరాజుగా సింధులుడనే రాజుకు కుమారుడుగా జన్మించుట, భోజుని పినతండ్రియగు ముంజుడు రాజ్యకాంక్షచే తనయన్నయగు సింధులుని మరణానంతరము భోజుని శిరచ్ఛేదనకై అరణ్యమునకంపుట, భోజుడు కత్తికెఱయైనాడా? తిరిగి రాజ్యప్రాప్తినొందినాడా? దుర్మార్గుడగు ముంజుడు యేమైపోయాడు? సరస్వతి మూగవాడుగా నుండి చివరకు యేమిపేరొందెను? దూర్వాసుడు స్త్రీగాజన్మించి యేమాయెను? దీక్షవహించిన శంకరుడు స్త్రీకి వశ్యుడైనాడా? తపమంతము నెగ్గించుకొనినాడా? చివరసారాంశము ప్రేక్షకులు ప్రదర్శనములోచూచి, పుస్తకములో చదివి ఆనందింతురుగాక.

ఇట్లు
S. R. V. స్వామి.

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు

—♦ పురుషులు ♦—

| | |
|---|---|
| సూత్రధారి | భోజుడు (రాకుమారుడు) |
| ఇంద్రుడు | పురజనులు |
| షణ్ముఖుడు | మాయావి (మాంత్రికుడు) |
| దూర్వాసుడు | అబ్బయ్య (కాళిదాసు) |
| బ్రహ్మ | సుబ్బయ్య (కాళిదాసు తండ్రి) |
| విష్ణువు | అచ్చిగాడు (మొరుకు) |
| శంకరుడు | సత్యవంతుడు (రాజు) |
| పాత్రధారి విష్ణువు | నీతివంతుడు (ప్రధాని) |
| పాత్రధారి శంకరుడు | మృదంగం } బడిపిల్లలు |
| సింధులుడు (రాజు) | తారంగం } బడిపిల్లలు |
| బుద్ధిసాగరుడు (ప్రధాని) | సారంగం } బడిపిల్లలు |
| బ్రాహ్మణులు | అప్పలశాస్త్రి (బడిపంతులు) |
| ముంజుడు (రాజు) | శంకరకవి (పండితుడు) |
| పౌరులు (రైతులు) | ఏకసంత గ్రాహి } ఆస్థానకవులు |
| వత్సరాజు (ప్రధాని) | ద్విసంత గ్రాహి } ఆస్థానకవులు |
| దైవజ్ఞుడు (యోగి) | త్రిసంత గ్రాహి } ఆస్థానకవులు |

—♦ స్త్రీలు ♦—

| | |
|---|---|
| నటి | మోహిని |
| సరస్వతి | సావిత్రి (రాణి) |
| సావిత్రి | అచ్చి (మొరుకు) |
| లక్ష్మి | సర్వమంగళ (రాకన్య) |
| పార్వతి | కాళికాదేవి |
| మాయాసుందరి | |

---

# —[ కథాసంగ్రహము ]—

అమరేంద్రుని యాహ్వానంబున, భరతమహాముని విరచితంబైన మాయాసుందరి విజయమను నాటక ప్రదర్శనమునకు, సకలదేవతాముని బృందము స్వర్గములో సమావేశమగుట, అందులో స్త్రీలకు వశ్యులుగాని వారీ రేసులోకంబులలో లేరని, విష్ణుపాత్రియు, జితేంద్రియులైనవారిని, కేవలచపలచిత్తులగు స్త్రీలు యేమియు చేయలేరని శంకరపాత్రియు, వారిరువురిలో వాద ప్రతివాదము లధికరించుట, శంకరు నోడించుటకు విష్ణువు మోహినిరూపము దాల్చుట, దూర్వాసుడు సరస్వతిని భూలోకంబున మెరుకువాడవుగా నుండుమని శపించుట, సావిత్రీదేవి, దూర్వాసుని స్త్రీగాజన్మించి నదే మెరుకువానిని గట్టుకొమ్మనిశపించుట, బ్రహ్మయు భోజరాజుగా సింధులుడనే రాజుకు కుమారుడుగా జన్మించుట, భోజుని పినతండ్రియగు ముంజుడు రాజ్యకాంక్షచే తనయన్నయగు సింధులుని మరణానంతరము భోజుని శిరచ్ఛేదనకై అరణ్యమునకంపుట, భోజుడు కత్తికెఱయైనడా? తిరిగి రాజ్యప్రాప్తినొందినడా? దుర్మార్గుడగు ముంజుడు యేమైపోయాడు? సరస్వతి మెరుకువాడుగా నుండి చివరకు యేమిపేరొందెను? దూర్వాసుడు స్త్రీగాజన్మించి యేమాయెను? దీక్షవహించిన శంకరుడు స్త్రీకి వశుడైనాడా? తపపంతము నెగ్గించుకొనినాడా? చివరసారాంశము ప్రేక్షకులు ప్రదర్శనములోచూచి, పుస్తకములో చదివి ఆనందింతురుగాక.

ఇట్లు

S. R. V. స్వామి.



# గ్రంథపోషకులు

మహారాజశ్రీ గూంమూరి సంజీవరావుగారు

,, ,, సాంబశివరావుగారు

,, ,, భాస్కర్ రావుగారు

వీరలు అసల్ దార్ పటువాళ్లు—

మహారాజశ్రీ బాస్పు కిష్టయ్యా పటేల్ గారు

,, ,, శివ్వయ్యా పటేల్ గారు

,, ,, గంగయ్యా పటేల్ గారు

వీరలు మొ॥ మాలి కోత్వాలి అసల్ దార్లు



శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః



# భోజకాళిదాసు నాటకము

## దైవస్తుతి.

శా॥ శ్రీలక్ష్మీశముకుంద మాధవదయా । సింధోజగత్పాలయా । ఫాలాక్షాద్యమర స్తుతాఫణిశయా । భక్తామనోఖేలయా । లీలామానుష విగ్రహామణిమయా । లీలావిలాసామయా । పాలించన్ యికరమ్మునీకృతినిమాం । పాహీ మురారీహరీ॥

ఆ-గీ॥ శ్రీహయగ్రీవు గొల్తునా చిత్తమందు । వాణికినిసల్పెదను భక్తి వందనములు । విఘ్ననాథుని నామది వినుతిజేతు । పవనతనయుని పదములన్ బ్రస్తుతింతున్॥

ప-గీ॥ శ్రీమదత్తానికృష్ణ దేశికులదలచి । మాతృపితృ దేవతల నామదిలొ గొలచి । పరగవిద్యా గురువర్యులకు ప్రణుతిజేసి । వ్రాయబూనితి గ్రంథమీ వసుధయందు । పూజనీయంబుగాగను భోజకాళి । దాసుచరితంబు నానంద దాయకముగా॥

### ప్రథమాంకము — (1-వ రంగము)

(యవనిలేచును)

సూత్రధారి - ప్రవేశం.

సభను వీక్షించి (తనలో) ఆహా! పలువిధ పరిమళభరిత నందనోద్యాన మటుల యీ సభాభవనం బెంత రమణీయముగా నున్నది.

పాట॥ ముదమాయె సభా । సదులను గనుగొన ॥ముద॥ సుదినమిదియు గన । విదితంబుగ మహా ॥ముద॥ మదనజనకుడేలు ప్రోలయిదితా ।

ముదముతోడ క్రీడ లాడుచుఁగుచుతా । తుదకుయమరనాథు పాలితం బగునదియ ననగనొప్పు చుండెనహహా ॥ముద॥ పరగ వేదపాఠ్య బృందమునుభూ । వరులుపైశ్వ శూద్రులుఁగా యెల్లరుఁగా । అరి వర్గంబున కిరవిడకంతః కరణతోడ మెలగుచుండెదరుగా ॥ముద॥ కేవలముగ సంతసంబుపేరల భావమునకుగల్గునట్లు వెంకట । రావు ప్యాట మారుతికరుణచె నొకరమ్యకధను వినగజేతునిపుడే ॥ముద॥

వ॥ యిప్పుడే మత్ప్రియసియగు నటిని రావించెదగాక.

(తెరనంక చూచి)

పాట॥ సఖియారాగదే యిందుజేరా । యీా । సరసుదంబునఁగా ముదము మీారా ॥సఖి॥ యికాలమునా సభికులెల్లరూ మహాకాంక్షతోడ నిటకూవచ్చిరి ॥సఖియా॥

వ॥ సఖీ నాట్యగాన కళాప్రముఖీ నీవొకసారి యిటురమ్మా.

(నటి ప్రవేశించి)

వ॥ నాథా! నమస్కరించెద — (అని నమస్కరించును.)

సూత్రి–వ॥ చెలీ శుభంబగుగాక.

నటి–పాట॥ సఖునన్నుబిలచుపనియేమిా । యీా । సభికులురాగతమేమిా॥ సఖు॥ యికఁగానాతో దాచకఁగానుడువుడా । ప్రకారమంతయు ముఖాముఖిగ ॥సఖు॥

వ॥ మనోహరా! నన్నిందు బిలచిన కారణంబేమి. యీా యెన్న రాని జనసమూాహ మిందున్న విషయమేమి నాతో విన్నవించుడు.

సూ–పాట॥ చరితమొండు వినగానోరీ । యిందరు చెంచిరె వోనారీ ॥చరిత॥ త్వరఁగానొక్క టేర్పరంచుమిక యెవ్వరుఁగా వినియుకని యెరుంగనీ॥ చరి॥

వ॥ నారీమణీ! అపారకుతూహలముచే నీసభ నలంకరించిన వీరల మనోనందకరమగు నేదేని నొక సారవంత చరిత్రము వినంజేయుగోరి నిన్నిందు రావించితిని కావున విచారించి విశదీకరించుము.

నటి-పాట॥ పరగ విహారతే యోచించీ । యేర్పరచుడినాయక పొంచీ ॥పర॥
యురంబులలో తస్కారణాబాపె పదికరంబైనదే చరిత్రయో॥

వ॥ నాథా! ప్రీతికరంబగు నూతన చరిత్రయేదో నీతికోవిదులగు తామే యెరుంగజేతురని జేతులు ముకుళించితిని.

సూ-పాట॥ జగతికీర్తి వెలయ పవిత్రా । భోజకాళిదాసుచరిత్రా ॥జగ॥
సుగుణంబులబ్బు న్యాయమార్గం । బగుపడును నదియె
గావలెను ॥జగతి॥

వ॥ ప్రేయసీ కామోన్మత్తుడై లేప్రియునిపై బూనిన కఠిన పన్నాగము న్యాయాన్యాయ విచక్షణ చివరకు మా యీ నాటక సూత్రధారి సంకల్పము తెలియంజేయునది భోజకాళిదాసు చరిత్ర కావున నదియే ప్రదర్శింప వలయును.

న-వ॥ యేమీ భోజకాళిదాసు చరిత్రమా.

సూ-వ॥ ఔను!

నటి-పాట॥ యెన్నోకథలు వింటినిగానీ । నద । యెరుగనైతినే పూనీ॥
యెన్నో॥ పన్నుగనాకేర్పఱచుడియాకథ । ఛెన్నుమీరకృతి
జేసిరెవరు ॥యెన్నో॥

వ॥ మనోహరా! జననాథుల చరితము లెన్నియో వినియుంటిని గాని యీ భోజకాళిదాసు చరిత్రను వినియుండలేదు వినయవిధేయత లోలుక యీవార్తను రచించిన వారి నామధేయము విన గోరుచున్న దాన.

సూ-పాట॥ తరుణి వెంకటార్యకవీంద్రుణ । నీ । వెరుగకుందువటె యెందుణ॥
తరు॥ కరీయాన వెంకటారావుపురి । మురారినెవుడుణ స్మరి
యించు ॥తరు॥

వ॥ లలనా తెలియనటుల బలుకుచుంటివేల జలజనాభుని కరుణచే పలుతెరంగుల పుస్తకములు వ్రాసి మనకొసంగినట్టి శాత్తాదశ్రీవైష్ణవ శ్రీరంగనాయకుల వెంకటార్య విరచితంబైనది నీవెరుంగవా.

న-వ॥ ఆర్యా! వెంకటార్యకవి విరచితగ్రంథములు మనము ప్రద

ర్శించి యుండవచ్చును. చాలాకాల మగుటచే జ్ఞాపకములేదు వారు వ్రాసిన పుస్తకములేవియో నొకమారు తెలిపిన విని సంతసించెదను.

సూ—వ॥ సరి! తెలిపెద వినుము.

సీసపద్యము॥ భామినివినగదే భీమాంజనేయంబు । కుశలవ వివహాంబు కుదురుగాను । సత్యనారాయణ మహాత్మ్యంబుమరియును । యక్షప్రశ్నలును సులక్షణముగ । వీరబ్రహ్మముగారి చారిత్ర మును చిత్ర । వర్మనాటకము భూవలయమందు । హరిహర ప్రభావమనెడు గ్రంథముగరుడ । గర్వభంగము భోజగాళి దాసు॥ గీ॥ యిట్టిబోత్తములు పదుగురి యిష్టముగను । మృదు మధుర శైలిగూర్చియు ముదమలరగ । శ్రీరమానాథుకృపచే రచించినారు । చంద్రతారార్కముగవృద్ధి జెందుగాత॥

నటి—వ॥ ఆహా! చాలా సంతోషమాయను గాని యట్టి భోజకాళి దాసు చరిత్రము కృతిజేయించిన పుణ్యాపురుషు లెవరో తెలుపగోరు చున్నదాన.

సూ—వ॥ సరి తెలిపెదను వినుము.

## వంశావళి.

సీసమాలిక॥ శ్రీకరంబుగ వెల్గు జిల్ల ఆదిలబాదు । పట్టుతాలూక లక్శెట్టిపేట । మానితంబైనట్టి మాజె వెంకటరావు । ప్యాటసివాసుడై బరగుచున్న । ప్రథమకులాన్వయ ప్రముఖులువ్యాపార్లు । గూడూరి వంశ తత్ కుసుమములగు । సంజీవరావును సాంబశివరావును । వరమనోహర్ రావు వాంఛితుండు । మరియుభాస్కర్ రావు మహనీయులున్నమరియు । బొప్పువంశమునందు నొప్పుచున్న । రాజయ్యనామసద్ రమణిలింగ మాంబ । యనుదంపతుల గర్భమునజనించి । ఆమీద రాజయ్య భూమక్క యనునట్టి । పుణ్యాత్ములకుదత్త పుత్రుడయ్యె । వాసిగద్వారక వాసులౌ దశముఖి । పూరణానంద మహాపూజ్యులైన । భద్రియార్యాగురు భక్తా గ్రగణ్యుడై । వెలసెకిష్టయపటేల్ వేడ్కమీర । బొప్పుశివ్వయపటేల్ బొప్పు గంగయపటేల్ । పెట్టైముగురువయ్య ప్రేమతోడ॥ గీ॥ మరియు తిప్పనిమల్లయ్య మహిని వెలయు । గాను వెంకటార్య కవీంద్రు కాజ్ఞ

యొసగ। ప్రాసెనీగ్రంథమును కీర్తివంతముగను। చంద్రతారార్కముగ జయము నొందుగాతా॥

నటి—వ॥ అయితే వారికీర్తి యీ ప్రపంచమందుండునంత వరకు వారు జీవించి యున్నటులే.

సూ—వ॥ ఔను మరేమనుకున్నావు వాపీకూప తటాక దేవాలయ ధర్మసత్రి నిర్మాణంబులు గ్రంథకృతులు యేమహానీయులు యొనరింతురో వారలెప్పటికి జీవించియున్నవారలే కాని అదుగో ప్రేక్షకులు నిరీక్షించు చున్నారు. నీవొకసారి యీ వసంతకాలమును వర్ణించి మనోరంజక మొనర్పుము.

న—వ॥ చిత్తము యటులే యొనరించుదానను.

—♦ వసంతకాలవర్ణనము ♦—

పాట॥ వసంతసుమనోవనముఁ గనగఁ వశంబెవర్ణించఁ ॥యీ॥వసంత॥
ప్రసూనరాజములుఁ । పసిండిగులాబి శశికాంతిగల ॥వసంత॥
పూదేనెలుగ్రోలి వీణనాదము సేయుచునుండే । ఆదెసయాలిం
చుడి భ్రమరంబుల రాగంబులయీ ॥వసంత॥ కిలకిలశుకపిక రవ
ములు చెలరేగెడిపావురములు । చిలిపికోయిలల్ నామదికలవర
మొందించెనుయీ ॥వసంత॥ మారుతమందంబున కాపూతెమ్మలు
బిలచుచుండె। జేరుదమాపొదరిండుల కోరికలలరఁ నాథా॥వసంత॥

వ॥ మనోహరా! పరిమళయుత పుష్పంబులు పరిహసించుటయే గాక విరిబాణుడు యోరువక నాపై నేమియో గురిపించుచున్నాడు యిక భరింపజాలకున్నాను కొంతవరకా పొదరింటి నలంకరింతమురండు.

సూత్ర—వ॥ ముదితా పొదరింటిలో। నిదిరించు సమయమిదియా సదసులు యెదిరిచూచు చున్నారు పదుము పాత్రల సిద్ధపరచుదాము.

నటి—వ॥ చిత్తము పదుండు. (నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

———

## 2 రంగము.

ప్రదేశము స్వర్గపురము – ప్రవేశం–ఇంద్రుడు–షణ్ముఖుడు.

ఇం—వ॥ షణ్ముఖా! మనస్వర్గపురంబున యేమి సంకటంబులు లేక యెల్లరు సౌఖ్యవంతులై సంతోషంబున నున్నవారలేనా.

షణ్ము–వ॥ సురనాయకా తమకరుణారస భరిత పరిపాలనంబున శ్రీహరి కరుణాకటాక్షంబున యెల్లరు పరమానందంబున నున్నవారలేకాని అదో ఆలకించుడు.

(ఇంద్రుడు ఆలకించి) వ॥ ఓహో! యెవరో మహానీశ్వరులేతెంచు చున్నారు రమ్ము యెదురేగి స్వాగత మొసంగుదము. (లేచిపోవుదురు)

(ప్రవేశం–దూర్వాసాది మహామునులు)

పాట॥ కృష్ణాయదునందనా రాధే ॥కృష్ణా॥ విష్ణుస్వరూపాయ విశ్వంభరా
రామ ॥కృష్ణా॥ శశిభాస్కరా నేత్ర అసమానరిపుజైత్ర। విసమే
తరీమిత్ర విమలాచరితాత్రహే ॥కృష్ణా॥ నారాయణాశౌరి నగధారి
మురవైరి। కారుణ్యసాగర కమలామనోహర ॥కృష్ణాయదు॥

(ఇంద్రుడు మునులంగాంచి ముకుళితహస్తుడై)

వ॥ హే తపోధనులారా! తమపాదంబులకివే ప్రణామంబులు రండు యీ యాసనంబు లలంకరించుడు.

ముని–వ॥ అమరేంద్రా! శుభంబగుగాక. (కూర్చుందురు)

(ఇంద్రుడు షణ్ముఖుని గాంచి)

ఇంద్ర–వ॥ షణ్ముఖా.

షణ్ము–వ॥ దేవా యేమియాజ్ఞ.

ఇం–పా॥ వినయముతోడా సజ్జనములుగొనియాడ। గనుదేవతా బృంద
మునకొప్పగా। అనుపుమివారెల్ల కనుగొనివేగంబె। జనుదెంచు
నట్లు యాహ్వానములు షణుముఖ ॥విన॥

వ॥ షణ్ముఖా! సకల సురబృందంబులకు తగిన యభివందనాహ్వానంబులంపి నేటి శుభదినంబుననే యీసభ నలంకరించునట్లొనర్పుము.

షణ్ము–పా॥ అమరేంద్రమా యట్టులనే వ్రాయుదునుగాని। క్రమమేమొ

నాతో వాక్రుణించరే ॥ తమరేమియూహాను దలపెట్టియున్నారో
అమరావళీ యాగమమేలగోరితో ॥అమ॥

శా॥ వార్తల్ దెల్పగనైతి నేమనియునే । వ్రాయంగలాండ్రమహా
కీర్తిన్ గాంచెడువైనచో సరియెలే । కించిత్తు కార్యంబుకున్
వార్తల్ బంచగనేల దేవమునులా । వారిందురానేల సం
పూర్తిన్నాతో వచించుమా విషయమున్ । పురుహూత వేవేగమున్॥

వ॥ నాకాధిపా! యేకారణములేక రాకంజేసిన లోకులు నగరా. మీకోరిక యేమిటో నాకున్ దెల్పుడు.

ఇం-సా॥ పొందుగవిను మాయాసుందరి విజయము । నిందూపద్రర్శన
మొందింపగా ॥ డెందములో పరమానందాము గురియం । గం
దలచితీనింక సందియమునులేక ॥పొందు॥

ఉ॥ వ్యాసపరాశరాభరత । వాల్మికతుంబురు నారదాది
దూర్వాసవశిష్ట మానులిటు । వచ్చిరివారి మనంబులెల్ల సం
తోసముజేయుగా మదికి । దోచెనునాట్య ప్రదర్శనంబుజూ
కోసము దేవతాఖిలము । కోరితినేవిన వోయిషణ్ముఖా॥

వ॥ మునిజనంబెల్ల జనుదెంచిరి కావున భరతమహాముని విరచితం బగు మాయాసుందరి విజయమను నాటకములోని జగన్మోహినీ పాత్రను అచ్చరకన్యలలో లేవయుస్కురాలగు సరస్వతీదేవి ప్రియశిష్యురాలునగు పుంజికస్థల కొసంగబడియెను. ఆపె నాట్యాభినయంబును గానమాధుర్యం బును గాంచ నుద్దేశించితిని దానంజేసి దేవతాబృందమును కూడా రావింప వలయును.

షణ్ము-సా॥ సంతసమాయె సురలంతావినియుకని । సంతోషపడగావిం
తామికా॥ యింతలోపత్రిముల్ లిఖింతూ చారులతో బంపింతూ
వారలను రావింతూవేవేగంబె ॥సంతస॥

వ॥ అటులైన సంతోషమే తృటికాలములో సురలందరు యిటకు వచ్చునటు లొనరించెదను.

ఇం-చం॥ మిగులశుభప్రదంబువిను । మీమునినాథులు యేగుదెంచుటన్
అగణితమైభవుండువన । జాతుడుబ్రహ్మయు శంకరాద్యులున్

జగములవేల్పులేయిటకు । జేరిననింకను జెప్పనేలనో
తగుసదుపాయమెల్లరకు । తక్షణమేర్పడజేయు షణ్ముఖా॥

వ॥ పావనమూర్తుల పాద దరిశనంబున మనజన్మలు పావనంబగును వారివారికి తగినసౌకర్యములు త్వరగా యేర్పరచుము.

షణ్ము—వ॥ చిత్తము అటులనే యొనరించువాడను.

(నిష్క్రమింతురు)

(3 వ రంగము – ప్రదేశము – సత్యలోకము)

(చతుర్ముఖుడు పత్రము జూచుచుండగా తెరలేచును) ఇంతలో సరస్వతి యేతెంచి బ్రహ్మనుగాంచి.

సర—వ॥ అదేమండీ! మీరు చూచునది.

బ్రహ్మ—వ॥ అభినవ నాట్యప్రదర్శనమునకై రమ్మని అమరేంద్రుం డంపిన యాహ్వానమిది.

సర—వ॥ అయితే మీరు నాటకము వీక్షింప స్వర్గలోకమున కేగుచున్నారన్నమాట. బ్రహ్మ—ఔను.

సర—పా॥ వనజాసనదేవాయేనూ । మీ । వెనువెంటను వచ్చెదనూ ॥వన॥
ఘనమగువేడుక యునువీక్షించెద । అనుమానించక గొనిపోవుడి ॥

వ॥ మనోహరా! నేనుకూడా మీతో వచ్చెదను.

బ్రహ్మ—పాట॥ నీవచ్చోటికి రావలదే। నీలావేణిరో వినగదే ॥నీ॥ కోవిద
వరులా కొలువునయుండిరి । గావుననీవా కాంక్షయుమానుమి ॥నీ॥

వ॥ దేవీ కోవిద సమూహముగల స్థలమునకు నీవు రాతగదు.

సర—పాట॥ మునిజనములు యచ్చటనున్నా । నే । కనుగొనదోషమ
టన్నా ॥ముని॥ మునుమీకేమై । ననుయాటం । కం । బునుగలి
గెన వలదనుటేలను ॥మునిజన॥

మ॥ సిరిమెద్దేనియు గోరకాదనడుయా । క్షీరాబ్ధిశయనుండు
నాగిరిజాపల్కునునైన శంకరుడునం । గీకారముగ సేయునొం
టరిగామీరలు బోవనేఘనమునా । టంకంబు నావల్లయీా
వరకెన్నండు ఘటించె నన్నటకురా । వద్దంటకే కారణమ్॥

వ॥ నాథా మీకుగల్గు విశేషంబుల కేమయిన యడ్డుగలుగునని నన్ను వలదనుచుంటిరా నేనేమి యాటంకపరుచను.

బ్రహ్మ॥ (తనలో) వలదనిన చలముగా బలుకుచున్నది మానులలో కోపోద్రేకులు తపోన్మత్తులు చపలచిత్తులు గలిగియుందురు గదా కాని యేమయినాసరే.

(ప్రకాశ)-పాట॥ శారదమాటలు చాలికనూ । ఓ ॥శార॥ సారమెరుంగరె స్త్రీలికనూ । ఓ ॥శార॥ భూరివెంకటరావ్ పురినిలయుండగు మారుతివరదుండేరక్షించును ॥శారద॥

ఉ॥ భారతియేల నీవిటుల । భావములో కపటమ్ముబూనియున్
దూరపుమాటలాడగకు । తూహాలమాయెన చాలుచాలు యిం
కేరభసంబు వల్లదట । కేగుదమే చెలి సంతసంబునన్
మీరగరమ్ము యాపిదప । మీనశరీరు కృపారసంబెటో॥

వ॥ సరి మీ అక్కయగు సావిత్రీదేవిని కూడా ప్రయాణముకట్టు మనుము పోవుదాము.

సర-వ॥ అదుగో అక్కయ్య యిటే వచ్చుచున్నది.

(సావిత్రిని గాంచి) అక్కయ్యా! అక్కయ్యా!

పాట॥ రావే పోదామూ సుర । రాజపురంబుననూ ॥రావే॥ దేవత బృందముకోవిద సంఘము । కేవలముగ నట కేగుదెంచిరట ॥రా॥

వ॥ యెల్లరు స్వర్గపురంబధిష్టించి నారట మనముకూడా పోవుదాము రా అక్కయ్యా.

సావిత్రి-పాట॥ కోమలిరో వినవే । ఘన । కోరికయేమొదవే ॥కో॥ ఆ మహానీయులు అందఱునచటికి । ప్రేమతోజనుటకు యేమివిశేషము ॥కోమలిరో॥

వ॥ శారదా వారందరచ్చోటికేగిన కారణమేమిటో మనమెందులకు బోవుదము.

సర-పాట॥ నటనప్రదర్శనమూ । సుర । నాథుభవనముననూ॥ పటుతరముగ యేర్పడు గావున మన । మటుబోదామిక తటకునరాగదె॥ నటన॥

వ॥ అచ్చట గొప్ప నాటకము జరుగునట కావున మనము కూడా పోవలయును.

సావిత్రి-పాట॥ ప్రియుడటు రాకున్నా । మనమేయిక బోతగునా ॥క్రియ॥
రయమున వెంకటరావుపురీశు డిదియు మెచ్చునయేదియు యోచింపవు ॥ప్రియుడటు॥

వ॥ మనోహరుడు రాకున్నా మనమే పోవుటొప్పునా యేమీ నీ పిచ్చితనము.

సర-వ॥ వారితోనే మనము నా కింతమాత్రము తెలియదా అక్కయ్యా. (సావిత్రిదేవి బ్రహ్మనుగాంచి)

సావిత్రి-వ॥ ఏమండీ. బ్రహ్మ-వ॥ ఔను రండి పోవుదము.

(నిష్క్రమింతురు తెరవ్రాలును)

( 4-వ రంగము - ప్రదేశము - స్వర్గపురము )

నాటకరంగము - ఉద్యానవనముతో నలంకరింపబడి ప్రేక్షకులు నిరీక్షించుచుండగా యవనిక లేచును.

( ప్రవేశం - మాయాసుందరి నృత్యముతో)

పాట॥ నాసరిగలరే లోకంబునా । నిజంబుగ ॥నాసరి॥ వాసవు సభలోన।
వనితలు యెందరో । వేసలబాసలభాసిలు చుందురు వీసంబుబోలరు ।నాసరి॥ ఈవయ్యారమిాగలుకు లేవయకాయంపు తళుకు ।
ఆవలరాజింతికే గలదే । అహ్హాహ్హా ॥నాసరి॥ వాణిదయావలన యింత దాననైతి నన్నుబోలు । గానకళావిమలును గలరే అహ్హాహ్హా ॥నా॥
(యిటుల నృత్యము సేయుచుండగా విష్ణుపాత్రి యేతెంచి.)
భేష్ ! భేష్ !

చం॥ నిజముగ యీ వయ్యారికల । నీటనుగాంచిన యెవ్వరేనికా
యజుశరబారికోర్చు కొని । యాగడ మొందక యుండువారె యా
భుజకుచయుగ్మ మధ్యమును । బున్నమవెన్నెలమోము కన్నులం
బుజములు కీరవాక్కులును । భృంగాలతలెన్నగ బుద్ధిజాలునే

( ఇంతలో శంకరపాత్రి యేతెంచి విష్ణువుతో )

వ॥ రమావల్లభా యేమా వర్ణన.

విష్ణు-వ॥ ఔను శంకరా ఆ లేవయస్సుకు తగిన యంద చందము కోకిలను మించిన కోమల కంఠము నృత్యగీతములం దుత్తీర్ణమైన యిత్తిలో దరిని గాంచిన యెట్టివారికైన చిత్తము తత్తరపడకుండునా.

శంక-ఉ॥ చాలును నీలవర్ణయిక । చాటగ నేలను యట్టి బుద్ధియుక్ నీలొగలందుదాన మము నీవలెనెంతువ । చంచలాత్ములౌ స్త్రీలు జితేంద్రియాపరుల । చిత్తముమార్చగ లేరుసుమ్మి యీ పాలునుమాలు మాటలును । బల్కకుమింక సభాంతరంబునక్॥

విష్ణు-పా॥ నీలకంఠచాలు మనోనిగ్రహపరులే యందరు ధీరులే । స్త్రీలకు లోబడని కఠినచిత్తులు యెందైనను గలవారలే॥

వ॥ శ్రీకంఠా లోకములో సుందరస్త్రీలకు వశులుగానివా రెవ్వరును లేరు.

శం-పా॥ ఇంద్రియ నిగ్రహులను యేసుందరిమణు లేమిజేయ లేరికక్ । యెందుకు యీమాటలు వినయందముగా వింకపొమ్ము యూరికేక్॥

వ॥ లక్ష్మీవల్లభా జితేంద్రియులైన వారిని కేవల చపలచిత్తులగు స్త్రీలు యేమియు చేయలేరు.

విష్ణు-వ॥ గౌరీరమణా ! స్త్రీలకు లోబడనివా రెవ్వరును లేరు.

శం-వ॥ జితేంద్రియులైన పురుషులను చపలచిత్తులగు స్త్రీలు యేమియు చేయలేరని ముమ్మాటికి బలుకు చుంటిని.

విష్ణు-వ॥ స్త్రీలకు లోబడనివారీరేడు లోకంబులలో లేరని మమ్మాటికి బలుకుచుంటిని.

శం-వ॥ అటులైన పలుకులందు గట్టిపెట్టి పనిలో ప్రజ్ఞావంతుడవు గమ్ము.

విష్ణు-వ॥ సరి చూచెదవుగాక.

(శంకరుడు నిష్క్రమించును)

విష్ణు-పా॥ మాయ తెలియగలరా నా । మహిమ తెలియగలరా॥ నా । మాయ॥ ఆయజరుద్రులు అమరేంద్రమహా । నీయులైన మానీశ్వరులైనా । నా ॥మాయ॥ నానారూపము లేనుధరించియు । నాటక మాడించె నాయకుడనునా ॥మాయ॥

గీ॥ నాతో పంతంబులాడి యుమనాథుడిపుడు
నయ్యరణ్యంబునఁ బూనెనధికదపము
త్వరగ మోహిని రూపంబుదాల్చి యతని
దీక్షగనకున్న యేను యిందిరవిభుడనే॥

వ॥ యిప్పుడే మోహినిరూపముదాల్చి శంకరునిదీక్ష యేపాటిదో వీక్షించెదగాక. (నిష్క్రమించును తెరవ్రాలును)

(౫-వ రంగము - ఉద్యానవనము)

(శంకరుడు నొక వృక్షచ్ఛాయన వ్యాఘ్రాజినుడై తపస్సు చేయుచుండగా)
(తెరలేచును)

(ప్రవేశం - విష్ణువు మోహిని రూపమునుదాల్చి)

పాట॥ ధీరుడవేలేవోయ్ చందమామా । యీ । యేరడ మెందులకోయి చందమామా । యీ॥ యేరడ॥ జేరితివేలను చాటున చంద మామా । నను జేరగ రాగదవోయీ । చందమామా.। నను జే॥ మారుమాటలాడవేల చందమామా।నీ । మాయలు నాతో సాగవు। చందమామా ।నీ ॥మా। ఆడుదాననౌ నోయ్ చందమామా నీ వాడినమాటలు దప్పకు చందమామా।నీ । వా॥ ధీరుడవేలేవోయ్॥

(యిటుల మోహిని నృత్య గాయనము సేయుచుండగా శంక రుడు వీక్షించి లేచి.)

తనలో-వ॥ ఆహా! అతిమాధుర్యంబైన యీ మధురవాణి యెవరై యుండ వచ్చును యేమా సౌందర్యాతి శయము.

పాట॥ తరమదీనివర్ణింప విధాతకైనహా ॥తరమ॥ మరునిచేతి శరబంతియు। మగువమోము శశికాంతియు । సరసిజములు కనువింతయు । సఖ యను గన జనుచింతయు ॥తరమ॥ కురులును భ్రమరములబోలు । కరితొండములాజాంఘ్రులు । సరియగుసింగిణులు భ్రూలు సరిమ ధ్యము కేసరిబోల్ ॥తరమ॥ జంభీరంబులు వక్షోజంబులు దంతం బులు డా । నింబబీజములు తిలపుష్పంబు నాశికంబుగనగ ॥తరమ॥

వ॥ జంటనెవ్వరులేక వొంటిగనేయున్నది దీనినంటని జన్మంబొక తుంటయేగదా, (మోహినిని సమీపించి)

పాట॥ నవమోహినీ । నీ । వెవరే నాతోడబల్కు ॥నవ॥ అవనిలో నీలా
వణ్యాము బోలు । యువిదాలులేరే యులుకూ మరాళగామి॥
నవ॥ వెన్నెలజేడు । నిన్నూజూచియు ॥పె॥ పన్నుగ మబ్బుచాటు
తా నున్నావాడదుగో కనవే ॥నవ॥ చీకటిగలవసంబు చిఱునవ్వు
లాతో వెలిగె । కోకిల నీస్వనంబువిని జేకొనె సిగ్గుమదిలో ॥వన॥
పరగ వెంకటరావుప్యాట వాసులకు యెపుడు । పరమానందంబు
గూర్చె పరంజ్యోతివినీవె ॥నవమోహినీ॥

వ॥ అహా! జగన్మోహినీ నీనవమోహన కంఠము నీవనియంతయు రవళించుచు నామేను పులకరింపజేసినది యేదీ నీమృదుశరీరము నదుము కొని నామదితృప్తిజేయుము. (అని కౌగిలించుకొనబోవును)

(మోహిని తప్పించుకొని శంకరునితో)

పాట॥ సరసుడవే । అహా । చాలునులే । నీ మరియాదయు దెలిసెనులే ।
పరమ తపోధన నీకిది పాడియే ॥సరసు॥ పరవనితలజూచియు సం
భాషించుచు వెఱ్ఱివయ్యె । పరిపరి విధములను బాగడుచేలనులే॥
సర॥ కరమరుదుగ వనసీమను బరికింపగ నచ్చితినా । పరిచారకు
లున్నరు నీ పరువును దీతురు పోపో ॥సర॥ అదిగాక జితేంద్రియు
డవు మదనతాపమున కలయుట । నదియధమముగాద మునులు
నగవరా । పదపడి వెంకటరావుప్యాట నివాసుండగుయా । మదన
జనకుడిది మెచ్చున మదిలో వలద విచారము ॥సర॥

న॥ ఆర్యా! చపలచిత్తులగు స్త్రీలనుజూచి తపస్సంపన్నులిటు చరించిన మీతపమునకు భంగము కలుగదా.

శం॥ తరుణీమణీ!

చం॥ తవమటు పాడుగాని ఫణి । తల్పుడు మెచ్చకపోని మానులుజ్జ
నెపమును వేయుగాని యల । నేకులు మీయొకవారురాని నీ
కృప యిసుమంతయేని గొన । కుండినదేహముచాలుగాని నీ
కపటముమాని నన్నుయిక । కావగరాగదె కామినీమణీ॥

వ॥ సఖీమణీ! నిన్నుజూడగనే నామది వికలంబయ్యె నిలువనీయకున్నది యొకసారి నీ సుఖసాగరమునందేల్చుము.

(అని పట్టుకొనబోవ పద్యోదనందును)

మోహిని-వ॥ఆఁ ఆఁ తపోధనా యేమీ దౌర్జన్యము నన్ను వద లుము— (అని విడిపించుకొని పయ్యెద సవరించుకొనుచు పారిపోవుచుం డగా వికారచేష్టలతోనుండిన దూర్వాసుడురివ్వున లేచివచ్చి మోహినితో)

కం॥ ఓ సుదతిరో ఆగుము నీ
దాసుడ నన్నేలుకొనుము । దయచెన్నారఁ
గాసిలుచుంటిని మోహా
పాశములో జిక్కి నిన్ను । ప్రార్థించితినే॥

వ॥ సుందరీ! ఆగుమాగుము.

పాట॥ కలికీ తొలగకుమా నను నీ కరుణ జూడుమా ॥కలి॥ వలచితినే తలచితినే । నిలచియు మాటాడవె ॥కలికీ॥ ఒయ్యారి మితారీ నీ పయ్యెదసపరించకుమా । చయ్యన । ముద్దియ్యుమ । నీ । నెయ్యము గోరితినే ॥కలికీ॥ ధర వెంకటరావుస్యాట ధాముడైన కే । సరితన యుడు । మరువకనిడు । వరముల సంబరముగ॥ కలికీతొలగకుమా॥

వ॥ ఒయ్యారీ నీ నెయ్యముగోరిన దాసుడనగునన్ను చయ్యన రక్షిం చుము నీ పయ్యెద సవరించకుము ఆగుమాగుము.

(అని పట్టుకొనఁ బోవును)

(దూర్వాసుని వికారచేష్టలుగాంచి సరస్వతీదేవి తనలో)

వ॥ ఓహెూ! యీ దూర్వాసుండు మోహాపరవశుండై

సీ॥ తానున్న యది స్వర్గస్థలమని యించుక । మదిలోన దలచక మారినాడు । తాజూచునది నాట్యతారని యించుక । మదిలోన దలచక మారినాడు । తాజూచుటకు వచ్చి తనియును యించుక మదిలోనదలపక మారినాడు । తా పదుగురిలోయుండి తనియును యించుక । మదిలోన దలుచక మారినాడు॥ గీ॥ మునివరుండయ్యె మోహాబ్ధి మునిగిపోయి । పరుగులిడుచుండె నాటకపాత్రివెంట । తపసులేజ్ఞాన హీనులై దనరుబిదప। అల్పులనుమాట నెంత నీ యవనియందూ॥ అహ్హాహ్హాహ్హా (అని నవ్వును)

(యింతలో మోహిని తప్పించుకొనిపోవును. దూర్వాసుండు వెను కకు తిరిగిచూచి.)

(తనలో) ఆ నవ్వునదెవ్వరు.............ఓ సరస్వతి......

క్రోధముతో-పాట॥ మొఱకుదనముచేత నన్ను బరిహసించుచుంటివెయా। మొఱకు పెరుక వేయగుపో భూమిన౯॥ మరివిద్యలరాణి ననుచు మురిసి విఱ్ఱవీగెదవా । పరమతపోనిధి శాపము పరగ ననుభవించుముపో ॥మొఱ॥ భూవలయంబున వెంకటరావుప్యాట హారికై సను । నే పెరువను నన్ను దెలియలేవా కో । దేవతలలో మాన్యుడనీ । కోవిదులలో ధన్యుడనీ । భావింపక దూర్వాసుని ప్రజ్ఞయు నిసుమంతెరుగక ॥మొఱ॥

వ॥ సరస్వతీ! మొఱకు దనముచేతనన్ను గని నవ్వితివి కావున ధరణీతలంబున నీవు మొఱకు కుటుంబములోనే పెరుగుదువు గాక పొమ్ము. (యనిన సరస్వతి హా! యని మూర్ఛిల్లును)

(సావిత్రీదేవి క్రోధముతో లేచి దూర్వాసునిగాంచి)

ఉ॥ ఓరి మదాంధమూసభలో । యోగ్యతగాని బనుల్ యొనర్చుటల్
నోరున కంతులేక యన । నోపునెదుర్మతి నిన్ను నేనిక౯
యూరికె బోవనిచ్చెదన । యుగ్రతపోధనునంచు నీవ్గెదో
బీరమడంగ జేతుమహా । భీషణరౌద్రముప్రజ్వరిల్లెగా॥

వ॥ ఓరీ! మదాంధమా నేరమంతయు నీయందే నుంచుకొని యీ మహాసాధ్వికి ధారుణశాపంబొసంగితివి కాని నిన్నుమాత్ర మూరక పోనిత్తునా॥

ఉ॥ భూతలమందు నీవు నొక । భూపతిపుత్రికవై జనించియు౯
ఖ్యాతిగ గుర్వుక్రోధమున । కంటికిరాతుని గట్టుకోని యా
నాథునిచే తిరస్కరము । నందివిషాదముజెంది లేశము౯
తన్మాతల సౌఖ్యము౯గనుక । జత్తువుగాక యిక౯ తొలంగుమా॥

వ॥ నీవు భూలోకములో నొకరాకుమార్తెవై జన్మించి గురువు క్రోధమునకు గురియయ్యె నా మొఱకుపెరుకనే కట్టుకోని అతనిచే తిరస్కరింపబడి సంసారసౌఖ్యము జెందక దిక్కుమాలిన చావు జత్తువుగాక.

(యిటుల సావిత్రీదేవి దూర్వాసుని శపింపగా శ్రీమహావిష్ణువు మధ్యరంగమున కేతెంచి.) (సావిత్రితో)

పాట॥ అంతకంతకును అధికంబౌనిక । శాంతించుము ఓ సాధ్వీలలామా॥
అంత॥ (దూర్వాసునితో) మంతనమున విడుమాకోపము । ముని।
చింతవలదు యోచింపని పనులివి ॥అంత॥ (యిరువురితో) త్వర
పడకుడినేనెరగించెదయీా । ధరపై విద్యలు బరపుటకై । పరగ సర
స్వతి ప్రముఖురాలునే । బురికొల్పియు సట కరుగుమనెడిదే॥అంత॥

వ॥ దిక్పాలులారా! భూలోకంబున గీర్వాణభాష యంతరించి పోవుచున్నది. వేదములు పురాణములు మొదలగు సకలధర్మములుకూడా నాభాషయందే నిమిడియున్నవి. ఆభాషయే అంతరించిన నింకేమున్నది. సకల ధర్మములడుగంటి పోవును కావున.

సీ॥ సర్వవిద్యలకును స్వసముద్ధరాలగు । భారతీదేవియే ప్రముఖు రాలు । యెటులైనవాణిని యేగిభూలోకమున । బ్రకటించుమనివిద్య బనుపనుంటి । అంతలోపలనిట్టి అంతరాయమువచ్చి । నాదుసంకల్పంబు నకునుచాల । అనుగుణ్యామైయుండి నదిగానశారద । భూలోకమునబుట్టి బుధులుబొగుడ॥ గీ॥ కాళికాదేవి కృపచేత కాళిదాసు । యనెడుపేరున చంద్రతారార్కముగను । విస్తరాకీర్తిగాంచు సావిత్రియిడిన । శాప మునుబొందు దూర్వాస సంయమీంద్రా॥

వ॥ ఈ యంతరాయము లోకోపకారమున కనుకూలముగా మారి నది కావున యీ సరస్వతీదేవి భూలోకమున కాళిదాసుడనే పేరొంది వర్ధిల్లును. సావిత్రీదేవి శాపంబున దూర్వాసుడు సర్వమంగళగా జన్మించి కాళిదాసును బరిణయమాడి చివరకు అధోగతి నొందును యిదితప్పదు.

సరస్వతి (బ్రహ్మనుగాంచి) నాథా! నాథా! అని పైబడి.

(సావిత్రిని గాంచి) అక్కా! అక్కా! (యని యేడ్చుచు)

పాట॥ అకటా నే తెలియనైతి నకటా ॥అక॥ ప్రకటితముగ నాటకమును
జూచితె । వికటమోసమీా విధియగునని ॥అక॥ ప్రాణేశ్వరనిను
భగినినివిడచియు । క్షోణిజనించుట కేనోర్వను ॥అకటా॥

సావిత్రి—పాట॥ చెల్లీ దుఃఖమువలదే మాతల్లీ ॥చెల్లీ॥ చల్లని వెంకటరావు
ప్యాటశ్రీ । నల్లనయ్య కరుణయెగల్గును ॥చెల్లీ॥

గీ॥ కర్మవశమున యీావిధి గలిగెనమ్మ । చింతసేయగ నేమ్తాను

చిన్ని చెల్లి । ధైర్యమునువీడబోకుశ్రీ ధరుడెనిన్ను । రక్షణాయు జేయుచుండు ననురాగ మెనయా॥

వ॥ చెల్లీ! ఆ అఖిలాండకోటి బ్రిహ్మాండనాయకుడే రక్షించగలడు. దుఃఖించిన నేమిలాభము.

సర-గీ॥ భగినిమణినిన్ను విడచియు ప్రాణనాథు । సన్నిధినిబాసి యేనొక్క క్షణముయేని । నొంటరిగ యెందు యెపుడేని యుంటినొక్కా । యిపుడునుండగ యెటువలె యిష్టపడుదూ॥

వ॥ అక్కా! మిమ్మొడబాసి వొక్క క్షణమైన యుండగలనా. (బ్రిహ్మకాళ్లపై బడి) నాధా! మీయెడబాటుగా నుండగలనా.

(శ్రీ మహావిష్ణువు బ్రిహ్మనుగాంచి)

వ॥ కుమారా సుర శ్రేష్ఠా.

బ్రిహ్మ-వ॥ దేవా యేమియాజ్ఞ.

శ్రీవి-పాట॥ నీయర్ధాంగియు నినువిడిపోవగ పాయనిదుఃఖము బరగెనికా ।
తోయజాసనా నీవునునీసతి తోబాటుగభువి నరుగుమికా ॥నీయ॥

వ॥ నీయర్ధాంగితో బాటు నీవుకూడా భూలోకంబున జన్మించుట కర్తవ్యమై యున్నది.

బహ్మ-పా॥ వనజోదర యెవ్వరియింటనునే జనియింపగవలయునొత్వరగా।
కనుగొనగనుయీ కాంతామణి కేమనిశలవిడెదరొ యేనెరుగా॥
వనజోదర॥

వ॥ యేనెవ్వరింట జన్మింపవలయును మరియు నీసావిత్రి కేమిశలవు.

శ్రీవి-పా॥ సింధులుడనె భూపాలునకీవు నందనుడుగ జననముగమ్మా ।
సుందరిమణి లీలావతియనె పేరొందియునిను బొందునుజుమ్మా॥

వ॥ భూలోకంబున సింధులుడనే ధర్మపరాయణతారుండగు మహారాజున్నవాడు నీవతనికి కుమారుండవై జన్మింపుము నీమహాసాధ్వి లీలావతిగ జన్మించి నీకర్ధాంగియగును. సరస్వతీదేవి కాళిదాసుండనే పేరుచేత నీసమక్షంబుననే యుండును మళ్ళీ కొంతకాలమునకు మీస్వస్థానంబు జేరుదురు పొండు.

బ్రహ్మ-పా॥ శంకలన్నియును దీరెనుయికవో శంఖచక్రధర లక్ష్మీశా ।
వెంకటార్య సత్కవివరదాఖిల సంకటహారణా సర్వేశా॥
వ॥ దేవా తవయానతి శిరసావహించువారము.

(నిష్క్రమింతురు తెరవ్రాలును)

గద్య
ఇది శ్రీరంగనాయకుల వెంకటార్య
ప్రణీతంబైన భోజకాళిదాసు
నా ట క ము న ం ద లి
ప్ర థ మా ం క ము
సమాప్తము.

---

(భోజకాళిదాసు నాటకము – ద్వితీయాంకము)

1–వ రంగము – ప్రదేశము ధారానగర రాజధాని

(ప్రవేశం సింధులుడు – బుద్ధిసాగరుడు)

సింధు–వ॥ అమాత్యవర్యా బుద్ధిసాగరా

బుద్ధి–వ॥ మహారాజా! యేమి యాజ్ఞ

సింధు–పా॥ ఆశను వదలి నిరాశబూని నే నందితిమోదముగా । యీ నాటికి ॥అందితి॥ భాసురముగ మన భవనమెల్ల శోభాయమానముగనూ । ప్రబలెగా ॥ఆశను॥

సీ॥ ధారానగరుపేర దనరునుజ్జయినిపురి। రాజధానిగనుండె రమ్యముగను । పరగవిదర్భను పాలించుచును కీర్తి । నలుదిశల్ గాంచితి నమితముగను । అఖల ఐశ్వర్యంబు లమరియు భక్తిచే। సత్కార్యములు యెన్నొసల్పియుంటి । దివ్యక్షేత్రములన్ని దిరగితినందున । సంతానప్రాప్తంబు సుంతలేదె ॥గీ॥ సుతవిహీనులకెల్ల సద్గతులులేవు । యనెడు శృతి వాక్యములు వినియడలి బహుగ । దుఃఖసాగరమునదేల దుదకు యిపుడు। భానుడుదయించినట్టాయె పట్టణంబూ॥

వ॥ అన్నివైభవంబులచే నిండి వెన్నెలలేని రాత్రివలె నున్నది గదా యని ఖిన్నుడనై యుండగా నా వెన్నుని కృపచే యిన్నాళ్ళకు చిన్నవాడు గలిగెనను శుభవార్త వింటినిగదా.

బుద్ధి–పా॥ పరమేశ్వరు కృపగురిసిన మనుజుల । కోఱతలు దీరునికా। వినుడికా ॥కోఱ॥ నరవరమీరలు పరమపుణ్యులిల । చరితాత్ములు గనుకా । వినుడికా ॥పర॥

వ॥ రాజచంద్రమా పూజనీయులగు తమపుణ్యావిశేషంబున యీ తేజము గాంచగలిగితిరి అదిగాక.

ఉ॥ ధాత్రిపతిఖ్యా యొనర్చు కడు । దాసునొనర్చు ముదంబుగూర్చు తా
పత్రియముల్ యమర్చు కడు । బాధలొ జేర్చు నెపంబుమార్చు తా
పుత్రులనిచ్చు నల్దిశల। పూజ్యునిగాను యొనర్చు నాటక
సూత్రధరుండు నేర్చు మహా। భారతభూపవరేణ్యా తెల్యుమా॥

వ॥ మాయానాటక సూత్రధారి చేయదలచిన పని యీయడ కాని లేది ప్రభూ.

సింధు-వ॥ ఔను యమాత్యా భగవదనుగ్రహము కాకపోయి తె యీప్రాయములో పుత్రుడుదయించునను ఆశ యుండినదా.

పాట॥ బంధుజనములకు బ్రాహ్మణులకు తగు। విందులు జేయంగా ।వల
యుగా ॥ పొందుగ దానము ధర్మంబులు నా। నందంబుగనివగా ।
వలయుగా॥ బంధుజనములకు॥

వ॥ బ్రాహ్మణ్యాది సాధుసత్పురుషుల సత్కరించి దానాధికంబుల నీయ వలయు గావున వలయునేర్పాట్లు సమకూర్చుము.

బుద్ధి-పా॥ భూమీశ్వరమీమదిలో విచారము । బూనకుడిసుమంతా। యే
నంతా ॥ యేమికొంతలు గలుగకుండునటు । లేర్పడ జేయిం
తుగ । నుతింతుగ ॥భూమీశ్వర॥

వ॥ ప్రభూ ! యెవరెవరికి తగినయేర్పాట్లన్నియు చేయించెదను.

సింధు-వ॥ మనగ్రామ పౌరోహితులగు ఆద్యంభట్లు పాశంభట్లు గారిని పిలిపించుము బాలునకు జాతక నామకరణంబులు చేయించవలెను.

బుద్ధి-వ॥ చిత్తము అటులే రావించెదను. (నిష్క్రమింతురు)

(2 వ రంగము - ప్రదేశము - బ్రాహ్మణవీధి)

—( ప్రవేశం - ఆద్యంభట్లు )—

పాట॥ భట్లనూ । ఆద్యంభట్లనూ । వేదాలు నేర్చిన ॥భట్లనూ॥ భట్లనూ
మాపిన్నవడుచుది అట్లు ముందర బెట్టినా ।-చీ ।కట్ల వెనుకకు దీయకా
తగినట్లు మెల్లనవేయనేర్చిన ॥భట్లనూ॥ పుణుకు లిరువై మైదు
శర్కరబూరె లరువై యరిసె లేబది । క్షణములో లాడూలు
నలుబై ఋణకకుండా దినగనేర్చిన ॥భట్లనూ॥ బుడ్డడంతా నెయ్యి
ఆలుగడ్డయు వంకాయ శాఖము । గడ్డపెరుగు ముద్దపప్పుతో అడ్డె
డన్నము దినగ నేర్చిన ॥భట్లనూ॥

వ॥ (స్వగతము) కాలం తల్లక్రిందాచుంది యేంజేయను అంతు లేకుండ నేర్చాను కాని ఆదరించే వాళ్లెవ్వరు.

(యింతలో నొక సేవకుడు వచ్చి) యేమండీ ఆద్యంభట్లుగారూ.

ఆద్యం-వ॥ యెవండ్లురా యిలారండి.

సేవ-వ॥ నేను భటుడనండీ మిమ్ముల్ని రాజుగారు రమ్మన్నారు.

ఆద్యం-వ॥ యేమీ! రాజుగారు రమ్మన్నారా యెందులకూ.

సేవ-వ॥ యువరాజు జన్మించాడుగా వారికి జాతకనామకరణములు చేయాలట మీవాండ్లందరిని తోడ్కొనిరమ్మన్నారు.

ఆద్యం-వ॥ ఆలాగా వస్తాము నీవు వెళ్ళు (సేవకుడుపోవును)

ఆద్యం-వ॥ (తనలో) నేటికి నాదరిద్రదేవత దాపువిడచినది నట్టు లేదు యిక దిట్టగవేస్తాను. (ఆవలికి వెళ్ళి)

వ॥ వరే పాశం యేంజేస్తున్నారా్రి.

పాశం-వ॥ ఆఁచేసేదేముందీ మలమల మాఁడుచుంటే మానెడన్ని అడుకులుండగా వేసుకున్నాను.

ఆద్యం-వ॥ పాపం యింతచల్ల తా్రికూ్కడదు.

పాశం-వ॥ యెక్కువగా లేదండీ. మూడుదవ్వాలచల్ల త్రావితే యే మూలకో పోయింది.

ఆద్యం-వ॥ అదేమాచుంది. కాని

పాట॥ ప్రభువు మనలా బిలిచాడమా । పాశంభట్లు వస్తావమరా ॥ప్రి॥
విభవమైన విందులమ విలువలేని సంభావనలమ॥ ప్రభు॥

వ॥ మనసింధులు భూపాలుడు బిలిచాడమ వస్తారా.

పాశం-పాట॥ అంతగొప్పకార్యమేమి । ఆద్యంభట్లు చెప్పవోయి ॥అం॥
సుంతమాకుదెలియదాయా । సుదినమిదియని చెప్పనాయా॥ అం॥

వ॥ రాజుగారింట్లో అంత విశేషకార్య మేమమండోయ్.

ఆద్యం-పా॥ నందనుండు గలిగాడమ । నామకరణంచేయాలమ ॥నం॥ అంద
రిని రమ్మన్నారమ । ఆలస్యంబువలదన్నారమ ॥నంద॥

వ॥ రాజుగారికి పుత్రోదయమయ్యాదమ జాతకంవేయాలమ నామ కరణంచేయాలమ వస్తారా లేదా.

పాశం-పాట॥ అమ్మతోడు వస్తాగాని । ఆగవోయి భక్ష్యంరానీ ॥అమ్మ॥
సమ్మతైన విందులు మరి । సంభావనలు యేమిస్తారో ।అమ్మ॥
వ॥ కాస్త భక్ష్యం వచ్చేదాక ఆగండి వాడుకూడా వస్తాడు.
ఆద్యం-వ॥ వాడెక్కువెళ్ళాడు యెప్పుడు వస్తాడు.
పాశం-వ॥ ఆఁఆఁ యిప్పుడే వస్తాడు కాస్తముక్కు పొడుం తెమ్మని పంపించాను కాని అన్నట్టూ భోజనవిశేషాలేమిటో.
ఆద్యం-ఉ॥ చిక్కని పాలకోవయుష । సీరజిలేబి గులాబిజామషా
మక్కువతోడ పుణ్కులష । మాధురియంబగు పంచభక్ష్యముల్
చక్కెర పొంగలన్నముష । చప్పటి పప్పుష కూరగాయలున్
మిక్కిలి నెయ్యిబోస్సరష । మీగడపెర్గుష మృష్టభోజనమ్॥
వ॥ కోరిన విందుబెట్టి కొదువలేని సంభావనలిస్తారష ఊరూరువాళ్ళందరొచ్చారష రండి రండి పొద్దుబోచుంది.
పాశం-వ॥ (అదుగో భక్ష్యంకూడా రానేవచ్చాడు; భక్ష్యంవంక చూచి) ఒరే ఒరే!
పాట॥ భక్ష్యంరారా కుక్షినిండ లక్ష్యంలేక భోంచేస్తాము ॥భ॥ భిక్షమెంత యెత్తినగాని । కుక్షినిండ కూడేలేదు ॥భక్ష్యం॥
వ॥ రాజుగారింట్లో ఇవ్వాళ్ళ పరిభోజనముష రారారా.
(అని పోవుదురు తెరవాలును)

3-వ రంగము - ప్రదేశము రాజభవనము

(పునఃప్రవేశము - ఆద్యంభట్లు పాశంభట్లు)

ఆద్యం-వ॥ పాశంభట్లూ రాసులు గుణించగలవా.
పాశం-వ॥ ఓ బాగా గుణిస్తానండీ.
ఆద్యం-వ॥ యేదీ పిల్లవాడి రాశేమూచుందో చెప్పు.
పాశం వ॥ చెప్పుచాను (వేళ్ళు లెక్కబెట్టుచు)
(తనలో) మేషం-మేక, యాదవులపాలు. వృషభం యెద్దు రైతులపాలు. కర్కాటకం ఎండ్రకాయ, పొక్కలపాలు. సింహం అడవులపాలు. కన్యా పడుచు మాపాలు. అయితే రాత్రి పదిన్నర గంటలకు కన్యా

మూలకు ప్రవేశిస్తే వృశ్చికం జొరబడ్డాది త్యాజ్యంలేదు. ఆఁ పురుషరాశి యిదండీ!

ఆద్యం-వ॥ యేడ్చావ్ లే పురుషరాశికాకుంటే స్త్రీరాశౌచుందిరా మూలకాదురా పూర్వాషాఢ అవుతే ధనురాశియింది భకారము ప్రథమమందుంచి భోజుడని నామకరణం చేయవలయును.

పాశం-వ॥ ధనుస్సు యెలా అవుచుంది. ధనుస్సు క్షత్రియులపాలయింది కదండీ.

ఆద్యం-వ॥ మరివీళ్ళు క్షత్రియులు కారసా.

పాశం-వ॥ ఓ నేనంతే అనుకున్నాను కాని దబుక్కున జారిపోయింది.

ఆద్యం-వ॥ తెలివి తెల్లవారినట్లే ఉంది పద పద.

(అని రాజుసముఖంబునకు వెళ్ళి బాలునిగాంచి రాజుతో)

పాట॥ భూజననుతతవ పుత్రరత్నమీా భువియందునగనగా । తేజవంతు డతి దీనదయాపర దివ్యచరితుడయ్యా । రాజితముగనువిరాజిల్లును సుర రాజవిభవములతో । భోజరాజుయని పేరిడితిమి సంపూజనీయుడై వెలయుఁ॥

వ॥ ప్రభూ యికమాకు శెలవిప్పించుడు.

సింధు-వ॥ సరి. (బుద్ధిసాగరుని గాంచి) బుద్ధిసాగరా వీరిని సన్మానించి పంపించుము.

బుద్ధి-వ॥ చిత్తము. (నిష్క్రమింతురు)

4 వ రంగము - ప్రదేశము - అంతఃపుర సౌధము

ప్రవేశం - సావిత్రి - చెలికత్తెలు

(పిల్లవానిని డోలికలో నూపుచుండగా తెరలేచును)

పాట॥ జో జో భోజరాజా । జో జో భానుతేజా । జో జో కల్పభూజా ।
జోజో జోజో... యేజగంబునింతకాలం బేలియున్నావో । యీా జగంబూనందునీవు । యిపుడు వెలిగితివా । యిపుడు వెలిగితివా॥
జోజో ... చల్లగాను కడుపులోని చల్లకదులాకుండగా । యెల్ల వారిని పాలించెదవా । యేకభావమునా । యేకభావమునా ॥జో॥

(నిష్క్రమింతురు తెరవ్రాలును)

పునఃప్రవేశం - సింధులుడు - బుద్ధిసాగరుడు.

సింధు-వ॥ అమాత్యవర్యా బుద్ధిసాగరా.

బుద్ధి-వ॥ మహారాజా! యేమియాజ్ఞ.

సింధు-సీ॥ అచిరకాలములోన అంతరించగనుండె । దేహావసన కాల దీవ్రమయ్యె । పంచవర్షంబుల ప్రాయమైననులేని । పసివాడు భోజుండు పాలుగారు । దుర్మార్గవృత్తిచే దులదూగుముంజుండు । వానిపై కృూరంబు వడయునేమొ । అందుకై ముంజుని హస్తమందిడుటయె । మంచి దనితోచెనా మదికినిపుడు॥ గానశీఘ్రింబె ముంజునిక్కడికిదోడి । తెండు మీఅందరునుభోజు నండవిడక । కంటికినిఱెప్ప విధమున గాతురంచు । నమ్మితినిసుమ్మి మిత్రజనమ్ములారా॥

వ॥ మంత్రీంద్రులారా! యింతవరకు పూర్వులట్లు అధర్మమున కవకాశమీయక మీ సహాయంబున పరిపాలన మొనర్చితిని యికనాకు పరమేశ్వరానుజ్ఞయైనది నాసోదరుడగు ముంజుని వృత్తాంతము మీరెరుంగనిది కాదు భోజునితోబాటు నీరాజ్యలక్ష్మిని కూడా కాపాడుమని ముంజునికే యొప్పగించిన యిక వాడే దుష్కార్యము లాచరించడు నా వంశాంకురంబును కాపాడుభారము మీయది యిక ముంజునిందు రావించుడు.

బుద్ధి-వ॥ చిత్తముప్రభూ. (నిష్క్రమింతురు)

—( ప్రవేశం - ముంజుడు )—

పాట॥ జనములుగా । మొనములుగా । ననుగనుగొనియును నసూయ తనుజెందెద రనవరతము ॥జనము॥ పెనుమూర్ఖుండగుమాయన్నను వినుతింతురు ఘనముగ । అనిలకణమువంటిముంజు డనియెరుగరు మనములలో ॥జన॥ యిందులకునుకారణమా సింధులుడే యగు నిజముగ । ముందువానిబంధమువిడి నందఱుసాధ్యంబౌదురు ॥జన॥

వ॥ వాడునాకు అన్నయట నగరులోని వాడొక్కడైనా నన్ను గౌరవించువాడు లేడు నాయాజ్ఞ మెలంగువాడులేడు వాడింకెంతకాలం

బీపరిపాలన చేస్తాఁడో చూస్తాను వాన్ని యమలోకంబంపనిదే నాకార్య
ములు చక్కఁబడునా.

(యింతలో నొకసేవకుడు వచ్చి)

వ॥ ప్రభూ! మిమ్మల్ని మహారాజుగారు రమ్మన్నారు.

ముంజు-వ॥ (తనలో) యెందులకో నాపై కొండెములేమయిన చెప్పుకున్నారేమొ వెధనలు, అన్నియు కనుక్కుంటాను అంతు తేలుస్తాను. (సేవకునితో) సరి! పద. (నిష్క్రమింతురు)

(పునఃప్రవేశం - సింధులుడు ముంజుడు)

సింధు-వ॥ సహోదరా యిటురమ్ము.

(అని దగ్గఱ కూర్చుండబెట్టుకొని)

సీ॥ తమ్ముడావినుము కోపమ్ము పాపమ్ము తా। పమ్మునకు మూ
లము నిజమ్ముగాను। తమ్ముడావినుము శాంతమ్ము సత్యమ్ము పు। ణ్యమ్ము
మేల్ జేయు నిజమ్ముగాను। తమ్ముడావినుము న్యాయమ్ము ధర్మమ్ము షే।
మమ్మునకు మూలమునిజమ్ముగాను। తమ్ముడావినుము జనమ్ముల ప్రీతిక।
రమ్ముజూచుట గౌరవమ్ముసుమ్ము॥ గీ॥ యిమ్ముగనునాదు వచనమ్ము
లమ్మరువకు। తమ్ముడాధారనగరమ్ము తనయుగొమ్ము। సమ్మతిగనేలు
కొమ్ము భూస్థలిశుభమ్ము। గొమ్ముసత్కీర్తినుమ్ము మేల్కొమ్ము వేగ॥

వ॥ తమ్ముడా యికనాకు బరమేశ్వరానుజ్ఞ యైనది యిదుగో రాజముద్ర యిదుగో భోజుడు నాకుమారుడుగాడు నీకుమారుడు వీనిని పనికిమాలిన వానిగా జేయకుము ప్రజలయందనురాగముంచి కాపాడు కొనుము యెట్టి అధర్మమునకు ఆశ్రయమీయకుము (అని ప్రధానివంక చూచి) మిత్రులారా! నా వంశాంకురంబును కాపాడుభారము మీ... (అని పడిపోవును) (అందరు యేడ్చెదరు తెరవ్రాలును)

ముంజుడు-ప్రవేశం (తనలో)

పాట॥ శోధించగలె। భేదించగలె। వాదించగలె। సాధించగలె యే
దొనరించిన గానిలనాకుఁ యెదురెవ్వండును లేడు యికఁ॥ యే
దురాత్ముఁ డెదురుకొన్నఁ ఆదురాత్ముఁ హతమొనర్తు॥

నాదు పరాక్రమ మెన్నగ యీధర నాథులు గడగడ వడకరోకో॥
శోధించగదె॥

వ॥ మస్తి సింధులు డొకడు నాకడ్డుగానుండెను యిప్పుడా పీడ వదలిపోయింది యిక సర్వాధికారము నాయదే నేనే కార్యము జేసినా యడ్డమెవ్వడు ఒకవేళ నన్నెదిరించినవాడేయున్న వాన్ని నాకరవాలమున కాహుతి యొసంగనా॥ (నిష్క్రమించును) తెరవాలును.

(ప్రవేశం – రైతులు బుద్ధిసాగరునివద్ది కేతెంచి)

పాట॥ బతుకగలేమయ్యా వో బాబయా। మా। ఈ తలన్నీ దొలగించి యేలుకోండి బాబయో ॥బతు॥ మితిమించిన పన్నులాయె। మెతుకులకే కరువాయె। క్షితినాథుడు ముంజుడుమా। సతులను జెరచుచునుండే। అతిఘోరంబాయెను మాగతియేమి బాబయో॥ బతు॥ పెద్దదొరా యుండగ మాకెద్దిభయము లేకుండెను। ముద్దుగ పరిపాలించెను। రద్దిరభస మెరుగమయా। పెద్దపులి బాధలకు దద్దరపాటొందితిమి॥ బతుకలేమయా॥

వ॥ అయ్యో బాబూ యీ ముంజుని పరిపాలనంబున మేమింక దరి ముట్టము యీకట్టము లోర్వలేము కరుణించి మాకట్టాలు బాపి కాపాడు తారా లేక యీరాజ్యమిడిసి యెక్కడికైన యెల్లిపొమ్మంటారా సెప్పు దొరో మీకు దండాలు దండాలు.

(బుద్ధిసాగరుడు చెవులు మూసికొని) ప్రజలారా! ఆగండి ఆగండి.

పాట॥ పురజనములారా వినుడికా। పురము వెడలావలదికా ॥పుర॥ మరి మీవాక్కులు కరణపురములై। శిరకంపము నెత్తెరయంబున ॥ పురజనము॥ మీకే బాధలులేకుండగయిక। రాకుండగజేసెద వేగమె ॥పురజనములారా॥

గీ॥ పుణ్యపురుషుల పాలిత। భూషణమగు
నిర్మలంబైన ఉజ్జయి। నీ విదర్భ
మనము జన్మించి మునులేని। మచ్చబెట్ట
తగదు మీబాధలణచి సంతసముగూర్తు॥

వ॥ పౌరులారా! యిక మీ కేసంకటంబులు లేకుండునట్లు జేసె దను మీమీగృహంబుల కేగుడు.

పౌరులు॥ సిత్తం సిత్తం. (నిష్క్రమింతురు) తెరవ్రాలును.

5—వ రంగము — మంజుని సభామందిరము.

(ప్రవేశం — బుద్ధిసాగరుడు)

వ॥ మహారాజా!

ముంజు—వ॥ ఏమా విశేషము.

బుద్ధి—పాట॥ నరవరనామనవియు వినుమా ఓ... ॥నర॥ పురజనులందరు
యిచ్చటి కరుదెంచియు సంకటముల। భరియింపగ లేమని యేడ్చిరి
వారలు ఘోరంబుగ ॥నర॥ ప్రజలను గర్భజులటులా పాలించగ
వలయుగాని। గజగజలాడించుచు భుజగమువలె సటియించరాదు॥

గీ॥ అమృతగుటకయ్యి ప్రజల నోళ్ళందవలయు
కీర్తిగోల్పోవవలదు నొక్కింతయైన
ప్రజలబాధించు టదిరాచ పాడిగాదు
గాన నీపరమార్థము లోనగనుమా॥

వ॥ కావున పౌరులకెట్టి సంకటంబులు గలుగనీయక కాపాడుటయే పరమావశ్యకము.

ముంజు॥ (తనలో) ఓహో! వైరాగ్యము మించిపోవుచున్నది. ప్రజలు మొఱబెట్టుకున్నారటా వీడు నాకు నీతులు గఱపువాడట! (క్రోధముతో)

పాట॥ వరె చాల్ చాల్ తెలిసెనీమరుగెల్లను దుర్మార్గబుద్ధి ॥వరెచాల్॥
పరికింపగ మూర్ఖచిత్తపౌరుల పక్షపాదివై నాకీనీతులు। గరపు
చుంటివీ పురమున నుండక। యరుగు మెచటికైన వేగమే ॥వరె॥
కాకులన్న రంచునీవు నాకడ కారముప్పు పప్పుకూడు దినుచును।
నాకెదురాడగ జొచ్చితి వేయిక జోకుండిన శిక్షబొందెదవు ॥వరె॥

మ॥ తులువాదుష్టుడ మూర్ఖచిత్తుడమహా। దుర్నీతుడాపాపుడా
తెలిసెన్నీయొక బుద్ధిపౌరులను। దోషత్తపొమ్ము దండెత్తియున్

నిలువఁగూడదు నాకడఁ నీవొకా । నిమిషంబుయైనఁజుమా
పలువాభోవక యుంటివావినుమికఁ । పాత్రుండ వేశిక్షకుఁ॥

వ॥ నీవు నాకడనుండతగవు నాకన్నుల కగుపడకుండ తక్షణమే వెడలిపొమ్ము మంచిమాటలచే బోవకుంటివా తగినంత చేయించెదను.

బుద్ధి॥ (తనలో) ఆసింధులుడు భోజుని నాహ_స్తమందిడకున్న యీ భోజుడే పెద్దవాడైయున్న వీనిగతియేమౌనో చూపుదునుకాని యేమి లాభము యీ గుణహీనుని కొలువు గొలుచుటకన్న వెడలిపోవుటే యు_త్తమము. (ప్రకాశ) ప్రభూ మీకంత ఆగ్రహమెందులకు నేనే పోయెదను. (అని వెళ్లిపోవును)

ముంజుడు (తనలో) యికనాకు పరమమిత్రుండైన వత్సరాజును ప్రధానిగా జేసికొనియెదగాక. (నిష్క్రమించును)

(ప్రవేశం – ముంజుడు – వత్సరాజు)

ముంజు–వ॥ మిత్రమా! వత్సరాజా.

వత్స–వ॥ మహాప్రభూ శలవు.

ముంజు–వ॥ నీవు నాకు బ్రధానివగుట నాభాగ్య మేమనవచ్చును. బుద్ధిసాగరుడు వెడలిపోయిననుండి నాయిష్టము వచ్చినట్లు వ_ర్తించు చున్నాను. యింకా నిరంకుశముగా నడుపవచ్చును.

వత్స–వ॥ యిదంత తమ కృపావిశేషముకాని అదుగో. (ఊరుకుండి)

గీ॥ యోగివరుడెవ్వరోయిట కేగుదెంచు । చున్నవారదుగోవారిని
సన్నుతించి । మనకెటులజరుగునో చెప్పుమనగవలయు । అంత
దెలియునువార లత్యంతఘనులూ॥

వ॥ ఆమహాత్ముడెవ్వరో వారివల్ల మనభవిష్యత్తు తెలిసికొనవలె నని నాయభిప్రాయము.

ముంజు–వ॥ అటులే యెదురేగుదాము పదుము. (నిష్క్రమింతురు)

—( ప్రవేశం – యోగి )—

పాట॥ మాయజాలమున పడబోకు నరుడా । మమత వీడుర వానరుడా॥
మాయ॥ కాయంబు నిలువదురా నరుడా । చొక్కపుదారి వీడకు

వానరుడా ॥మాయ॥ భగవంతు నేమారకుమురా । దేహబల మున్నదని మురియకురా । పొగరెక్కి మిడ్రింగెద ననియు । అగ్ని దగడందు బడిమిడత మడయూ ॥మాయ॥

(యింతలో ముంజుడు వత్సరాజే తెంచి యోగితో)

వ॥ అయ్యా! నమస్కారములు.

యోగి-వ॥ దీర్ఘాయుష్మాన్భవ.

ముంజు-వ॥ మహాత్మా రండు మాగృహము పావన మొనర్పుడు.

(పోయి కూర్చుందురు)

ముంజు-పాట॥ యెరగించుడి మునివర్యా । మునివర్యా । పరమతపో తత్పరులగుమీారలు యెరుగని దేదీ ధరలోనుండదు ॥యెర॥

వ॥ మహాత్మా! సర్వజ్ఞులు తామెరుంగని యంశములుండవు కావున విశేషాలు తెలుపగోరు చున్నాడను.

యోగి-పాట॥ యెరగించెద నటువలెనే । నటువలెనే । నరవరనీలో నది యేమిటిదో । పరమావశ్యక పద్ధతిదెలిపిన ॥యెర॥

వ॥ నీవు యేదిగోరిన నదియే చెప్పగలను నీకుకావలసిన దేది.

ముంజు-పాట॥ ధరణీపతులలో పేరొందినయీా । ధారానగరము కేనూ । ధారానగరము కేనూ । వరునై తినియెటు వలెనున్నదానా । కరమందలి రేఖలఫలితంబును ॥యెర॥

వ॥ నాహస్త రేఖల ఫలితం బెటులగలదో చూచి తెల్పుడు.

యోగి-పాట॥ యేకాంతంబున దెలిపెదనిచ్చట యెవ్వరునుండగావలదూ। నీకిదివరలో జరిగినసంగతి । నికముందర కానున్నదియేమో ॥యెర॥

వ॥ నీభూతభవిష్యద్వర్తమానము లెల్ల తెల్పుదునుకాని అది రహస్యముగా చెప్పబడును.

ముం-వ॥ సరి నొరులెవ్వరును లేరుగా (వత్సరాజునుగని) మిత్రమా వత్సరాజా నీవు గొంతసేపు......

వత్స-వ॥ చిత్తము అటులే పోవుచున్నాను. (అని పోవును)

(ముంజుడు యోగినిగని)

వ॥ మహాత్మా! యికచూడండి...(అని చేయినిచ్చును)

(యోగి-ముంజుని అరచేతినిచూచి)

రాజన్—గీ॥ చెప్పినంతటకోపంబు జెందవలదు । యున్నవాస్తవ్య మునునీకు విన్నవింతు । హస్తరేఖలఫలితంబు యనృతమెపుడు । గాదు భువిలోనముంజ భూకాంతవినుమా॥

వ॥ చెప్పినంతట నీ కేమయిన క్రోధము వచ్చునేమోయన్న విచారము.

ముంజ-పాట॥ మదికివలదుచింతా । నాకింతా ॥మది॥ అదినీనేరం బగు నెటువలెనా । విధిదెలిపినదే నౌదవుదునెటువలె ॥మది॥

వ॥ ఉన్నవిషయంబు దెలిపిన నిన్నేలకోపింతును ఏమాత్రము శంకించక తెల్పుము.

యోగి-మ॥ వినుమానీయొక లక్షణంబునృపతీ । విన్పింతునున్నట్టులన్ ఘనమౌక్రూర స్వభావమున్ గలదు । దక్కన్ బోదు రాజ్యంబు నీ కనయంబెక్కుడు కోపమున్ ప్రజలు నీ। కన్ రాగమున్ లేరు యా వనమందుండెవు సాధువై యికను నా । వాక్కుల్ వృథాగావుపో॥

వ॥ నీకు కోపమధికము క్రూరస్వభావము ప్రజానురాగము నీయడ లేదు నీకీరాజ్యంబుకూడా నుండబోదు ఇకముందుకూడా కాననవాసమే యగును.

ముంజుడు- (తనలో) ఓహో యీతడునుడువు వచనంబులన్నియు నిక్కవములనే నామది నమ్ముచున్నది భోజుని భావికాలం బెటులున్నదో తెలిసికొనవలయు (ప్రకాశ) యెవరక్కడ.

సేవ-వ॥ మహారాజా! శలవు.

ముం-వ॥ భోజుడు పాఠశాలలోనున్నాడు త్వరగా వానినిందు బిల చుకరా పొమ్ము.

సేవ-వ॥ చిత్తము. (అని వెళ్ళును)

గద్య॥ ఇది శ్రీ రంగనాయకుల వెంకటార్య కవివిరచిత భోజకాళి దాసు నాటకమందలి ద్వితీయాంకము సమాప్తము.

శ్రీ భోజకాళిదాసునాటకము-తృతీయాంకము ప్రారంభము.

1- వ రంగము - పాఠశాల ప్రదేశము.

(ప్రవేశం - భోజుడు)

పాట॥ కరుణా భరణ రారా । నీ । కరుణా । గోరితినిరా ॥కరు॥ పరమ పురుష నీ పదకమలములను । మరువకనామన్మందిరమందున । స్థిరముగ నమ్మితి దీనపోషయో । కరివరదాచ్యుత కమలప్రియా ॥ కరు॥ పిలువనంపెనా పినతండ్రియు । చదు । వులపరీక్ష నేమియు గొనునో నా । పలుకుల యందున నిలచియునచ్చట । వెలిగించుము నా వెఱపుదీర్చు ॥కరుణా॥ రంగా వెంకట రావుప్యాట శ్రీరంగా । గరుడతురంగా । రంగనాయకుల వెంకటార్యకవి । పుంగవనుత సారంగపాణి ॥కరుణా॥

(ముంజునివద్దికి వచ్చి) జనకా! వందనములు.

ముంజుడు-వ॥ జయంబగుగాక.

భోజుడు (యోగితో) మహాత్మా! ప్రణామంబులు.

యోగి-వ॥ వత్సా! దీర్ఘాయురస్తుః

ముంజుడు యోగితో-వ॥ మహాత్మా! యీబాలుని హస్తము జూడుడు.

(యోగి భోజుని హస్తముజూచి) అబ్బాయీ! యిక నీవుపొమ్మ్మ.

(అనగా భోజుడు వెళ్ళిపోవును) యోగి ముంజునితో.

వ॥ భూపాలకా! యీబాలుని రేఖలు యేమనందగు.

ముంజు-వ॥ స్వామీ! యెటులున్నవో యెరింగించుడు.

యోగి-పాట॥ సుగుణవంతుడీబాలకుడమితా శూరుడు వినవయ్యా। అగణితంబగు విద్యలయందున ఆటపట్టువయ్యా । మిగుల శాంతము కని కరము ప్రజలమీాద నుంచునయ్యా । జగతికీర్తిగా రాజ్యమేలును ప్రచండ తేజమెనయా॥

కం॥ పరగను ధారానగరము

పరిపాలనముఁ గొనక్చు । ప్రభుపీతండే

నరవర బన్నకుమా యీ
చిరుతనిపై దుష్టబుద్ధి । చిత్తములోనక॥

వ॥ అన్ని సుగుణంబులచే నిండిన యీ బాలకుండే ప్రజానురాగముగా యీ నగరము పరిపాలించును. నీ దుర్మార్గవృత్తి యబ్బాలునిపై బ్రయోగించకుము. అటులొనర్చితివా నీకే చేటువాటిల్లును. యిక నాకు శలవు.

ముంజు-వ॥ మహాత్మా! తమపాదంబుల కివే ప్రణామంబులు యీ పారితోషికము గైకొనుడు. (అని నొక హారమొసంగును)

(యోగి తీసికొని నిష్క్రమించును)

2-వ రంగము - విచారమందిరము.

ముంజు-వ॥ మిత్రమా! వత్సరాజా!

వత్స-వ॥ ప్రభూ! యేమియాజ్ఞ.

ముంజు-పాట॥ వినువినుమా మనవినొకటీ । వినజేతును నది ఘనమైనది
యో వీరాధివీర వేగ ॥ వినువినుమా॥

వ॥ మిత్రమా! అట్టి విషయము దెల్పుటకు నోరాడకుండెనుగదా.

వత్స-పాట॥ ఘనమైనా పనియ దేమీా । జననాయక వినజేయుడి మీా
మది యనుమానమేల నింక ॥ఘన॥

వ॥ మహారాజా! సంకోచమెందులకు అంతద్భుతవిషయ మేమిటో తెలుపగోరుచున్నాడను.

ముంజు-పాట॥ విసమయము బీజమొకటీ । మసలుచుండె మన పురములో
దాని సిసలుంచగారాదు ॥విసమయము॥

వ॥ మన నగరములోగల విషబీజము నుంచకూడదని నాయభిప్రాయము.

వత్స-పాట॥ నదియేమో తెలియునటులా । కుదురుగ దెల్పుడి విషబీజము
యంకురించె నేవిధముగ ॥నదియేమో॥

వ॥ నరనాయకా! మీారనునది నాకేమి బోధపడుటలేదు.

ముంజు-వ॥ భోజుడు రాజగునని కాలజ్ఞుడు దెలిపియున్నాడు.

కావున వాడు రాజేయైనచో మనల నెవ్వరు గౌరవించరు. మన యధికారము యాటలు సాగవు. అందుగురించి ఆ విషపుమొక్కను నిర్మూలించుటే యుచితము అట్టిపని నీవల్ల నెరవేరును యేమందువు.

వత్స—వ॥ మహారాజా! ఆకాలజ్ఞుని మాటలు నిజమని నమ్మి యే మెరుంగని పసికందుని జంపుట భావ్యమగునా! ఆశాస్త్రములే యదార్థములగుచో.

మ॥ అలనాడా రఘురామచంద్రు డరిగెన్ । యాదండకారణ్యముల్
నెలతన్ బాసి యనేకదుఃఖముల తా । నెన్నోశ్రమల్ బొందెగా
దెలివిన్ దేటలతో వశిష్టుడప్పుడున్ । దెల్పెన్ ముహూర్తంబు యా
ఫలమెందున్ జనె నట్టి జ్యోతిషమికన్ । పాటింపగా వచ్చునే॥

ముం—ఉ॥ నాకెదురాడబోకను యొనర్చుము వేగమె యిట్టికార్యముల్
నీకునుకొన్ని గ్రామములు । నిచ్చి యొనర్చెద సామవంతుగా
లోకులకున్ భయంపడకు । లోనిరహస్యము వెల్లడించకన్
జేకొనబోక పన్నులను । జెల్వముజూపిన జేయరేమికన్॥

వ॥ లోకులకు వెఱగంది వలదనుచుంటివేమో కొంతకాలం ప్రజాభిమతముగా నటించిన మనలనెవ్వరేమి జేయజాలరు అదియునుగాక నీకు కొన్ని గ్రామంబు లొసంగి జాగీరుదారుగా నొనర్చెదను వింటివా.

వాదం.

వత్స—పాట॥ తగునా యిటులనగ రాజా ॥తగు॥ సుగుణవంతుడా సుకుమారుని ॥తగు॥

చం॥ చిన్నవయస్సుబాలకుడు । చిత్తములో కపటమ్మెబూనునే
యెన్నగసైన్యముల్ బలము । యేమియెరుంగని నిస్సహాయుడున్
నిన్నెదిరించెనా యకట । నీఃపడులన్ గిరి జాటెనాస్వయం
అన్నసుతుండటంచు యనకన్ । దునుమాడగ నొప్పునేభువిన్॥

వ॥ ఆకురర్రివానిచే మీకేమయిన సంకటంబు గలుగునేమో యని మీరీపని దలపెట్టి యుండవచ్చును. యావద్బలము మీచేతిలోనుండగ యబ్బాలునిచే మీకేమి విపత్తు గానేరదు కావున మీరు రాలోచన విరమించుటే యుచితము.

ముం-పాట॥ అదియునే నెరుగుదు నాకెదురాడక నెరవేర్చుము । పదపడి శాత్రివునివృద్ధి పరుచగరాదికవినుమా ॥అది॥

వ॥ శాత్రవునివృద్ధిపరచు నీయుపదేశముచాలు నిన్నందునిమిత్తము బిలువలేదు చిన్నవాడైన పెద్దవాడైన శాత్రివుడు విషము. విషమెంత దాివనగును కావున నీవాపని యొనర్చకతప్పదు.

వత్స-పాట॥ పాపనిపై కోపమూనీ ॥పా॥ యీాపనిజేయుట పాపమగును॥

వ॥ పసివానిపై యింత కఠినము దలంచుట పాపహేతువుగాదా ప్రిభూ.

ముం-పా॥ చచ్చెదవా చంపెదవా । ఖచ్చితముగ బలుకుచుంటి । యిచ్చగింపకున్ననిన్ను మచ్చుకులేకుండజేతు ॥చచ్చెదవా॥

గీ॥ నీవుయొప్పకున్న నీమృతిదప్పదు । తద్వాంతిభోజునికి తప్పబోదు । దినమునొక్కటియె వ్యత్యాసమిని యొసంగితిభోజు । శిరము వేయుమునాదు చరణములపై ॥

వ॥భోజునికాపాడెదనని నీయభిపాియము కావచ్చును మీారిరువురి మృతి దప్పదు యిందుకు నొక్కదినమే గడువు నిచ్చుచున్నాడను నీవు బ్రితుకదలంచితివేని భోజునిశిరముదెచ్చి నాకాళ్ళపై వేయుము.

వత్స-వ॥ (స్వగతమున) ఆహా ! నేనేమిచేయువాడను యెన్నివిధంబుల జెప్పినను వినక చివరకు యిరువురి మరణము దప్పదని కోిధమున బలికెను పాపాత్మునికి పాపభీతియుండునా సర్వేశ్వరా నీసంకల్పం బెటులున్నదో.

(ప్రికాశముగా) సరి! అంత కఠినమెందులకు మీాయభిపాియము మారునా లేక దృఢమాయని అటులనిచూచితిని కాని మీాయాజ్ఞకు వేరున్నదా.

ముంజు-వ॥ అటులనా సరి అతిశీఘ్రిముగా యీాగుట్టు బయటపడకుండ వాని శిరచ్ఛేదనచేసిరా పొమ్ము.

వత్స-వ॥ చిత్తము అటులే యొనర్చెదను. (నిష్క్రిమింతురు)

—( వత్సరాజుకు భోజునికి వాదం )—

వత్స-పాట॥ రమ్మాపోదాముా । యో । రాజనందనా నాతో ॥రమ్మా॥

రమ్మికమీనాన్నగారు రమ్మన్నరు నచ్చటనొక । రమ్యమైన వింత
గలదు రయమున జూడగబోవలె ॥రమ్యా॥

వ॥ భోజనృపాలా । మీపినతండ్రిగారు వేడుకలుజూచుటకు బోవు
చున్నాడు కనుక నిన్నుకూడా రమ్మన్నాడురమ్మ.

భోజు-పాట॥ పాత్రాడానయ్యా । నా । పిత్రుదేవునిదయకూ ॥పాత్రా॥
ధాత్రీశుని యానతితల దాల్చివచ్చువాడగాని । రాత్రివేళవింతలు
మన రాజధానిలోవలదా ॥పాత్రా॥

వ॥ మనరాజధానిలో లేని వింతలు మరెచ్చటగలవు అదిగాక యీ
రాత్రివేళ యేవింతలుండును.

వత్స-పాట॥ మేలూమేలైనా । మృగజాలము గననౌవనిలో ॥మేలూ॥
లాలితమగు తరువులు పాలాబ్ధినందనుని వెలుగున । నోలలాడు
చుండు కడువినోదము గొల్పుచునుండూ ॥మేలూ॥

గీ॥ అటలాడుచునుండు వనాటులెల్ల
గానములు సేయునట । విహంగములతతియు
గాంచుటకు యందమైనవి। గలవుయెన్నొ
రాజభవనము నవియెట్లు । రానుయొప్పు॥

వ॥ అట్టి వింతలు అరణ్యమందుండు నవియేకాని రాజధానిలో
నుండవు.

భోజు-పాట॥ చూడా గోరితినీ । యా । సుందరమగు వింతలునే ॥చూడా॥
వేడుకలర గొన్నిటి మనవెంబడి గొనితెత్తాము । ఆడుకొనగ
వచ్చును మనయంతఃపురములో నునిచీ ॥చూడా॥

కం॥ అమ్మను దోడ్కొనిపోదము
అమ్మహావింతలును జూచి । యానందించున్
క్రమ్మర బిలుచుకవచ్చెద
సమ్మతిగను యరదమీవు: । సాగించుమికన్॥

వ॥ అమ్మనేగాక యింకా సహచరులుకూడా వచ్చెదరు నీవు రథము
సిద్ధపరుచుము.

వత్స-గీ॥ అందరును బోయియున్నారు । ముందుగానె
స్త్రీలు యచ్చోటికిని రాను । వీలుపడదు

గాన మీయమ్మనూ బిలువ । గానుతగదు
రమ్ము శీఘ్రమ్ముగాను । యో రాకుమారా॥

వ॥ అందరు నప్పుడే పోయియున్నారు స్త్రీలా స్థలమునకు రానో ప్పుదు కావున నీవు త్వరగారమ్ము. (నిష్క్రమింతురు) తెరవ్రాలును.

(పునఃప్రవేశం 3-వ రంగము అరణ్యప్రదేశము.)

భోజు-వ॥ వత్సరాజా!

వత్స-వ॥ యేమీ!

వాదం.

భోజ-పాట॥ మనవాళ్ళగు పడరేమీ । యీ । మందిరమున గలదేమీ॥
మన॥ కనుగొన వెన్నెలకాంతిలేదు యీ। పెనుచీకటి గ్గలైను భీతా
హాము ॥మన॥

వ॥ మనమింకెంత దూరమేగవలయు కారుచీకటిలో యీ మంది రము జేరితిమి యిందేమిగలదు.

వత్స-పాట॥ మనవాళ్ళందరు వినుమా । యీ। మాయాదేవి యెకనుమా।
మన॥ మనమునభీతిని మానుము యిదుగో । ఘనవేడుకనే గన
బరచెదనూ ॥మన॥

వ॥ బాలకా త్వరపడకుము. యీ మందిరమున గల మాయా దేవియే మనవాళ్ళనుకోనుము. మనము జూడవచ్చిన ఘనవేడుక యిదే చూడుము. (అని ఖడ్గము జూపును)

భోజు-పాట॥ నాకెటు యర్థముగాదూ। మది। నమ్మికదోచుటలేదూ ॥నా॥
ఈకరవాలము యింటిలో జూచినదేకాదా నందేమి వేడుకా॥నా॥

మ॥ మనవాళ్ళందరు వచ్చిరంటివికదా । మాటేది నిక్కంబు యిం
దున వింతల్ గనరావు యెవ్వరును । యిందుఁ లేరు యీరాత్రియుఁ
మనమిచ్చోటికి వచ్చుటేకతమొ నీ । మర్మంబునాతోడనుఁ
అనుమానించక తెల్పు వేడుకలు । నీయసిధారలో నుండునే॥

వ॥ నీమాటలు నాకేమి యర్థమగుటలేదు వత్సరాజా! నాకేమో యనుమానము దోచుచున్నది.

వత్స-పాట॥ అనుమానము బాపెదనూ। నీకసతివ్యవధినొసగెదనూ ॥అను॥

జననిజనకులను దలచుకొనుముయింకను యేమున్నను వినజేయుము త్వర ॥అనుమానము॥

వ॥ బాలకా! మీపినతండ్రి యాజ్ఞయైనది గావున నీశిరస్సు ఖండించెదను త్వరగా యేమైన జెప్పవలసియున్న విషయములను జెప్పి యీ మాయాదేవికి నమస్కరించుము.

భోజు–వ॥ ఆఁ యేమీ వత్సరాజా మాపినతండ్రియాజ్ఞచే నన్నిందు చంపుటకు గొని తెచ్చితివా.

వత్స–వ॥ ఔను చంపుమనియే శెలవిచ్చినాడు.

భోజు–వ॥ హా! జననీ...... (అని మూర్ఛనొందును)

(అశరీరవాక్కు)

పాట॥ వేడుకగోరిన బాలకుండుతా వెతలోబడినాడే। పాపం ॥వెత॥ తోడివారలకు దెలుపకకపటుని తోడబోయి గుడిలోజేరీ। కీడుమూడెనని తెలిసితనమదిని గోడుగోడునా దుఃఖపడే ॥వేడుక॥ పిన్ననాడె తండ్రినిగోల్పోయితి పిన్నతండ్రియే యిటుజేసే। కన్నతల్లిగతియేమో యిదికా నున్నకార్యమని తలపోసే ॥వేడుక॥ ధరణివెంకటారావుప్యాట శ్రీధరనీవే యాధారమనీ। కరవాలంబున కెఱియగుటకుతన శిరమువంచి నిల్చెనుపూనీ ॥వేడుక॥

(యింతలో భోజుడు మూర్ఛదేరి) తల్లినుద్దేశించి......

పాట॥ అమ్మా నాకగూపడవయింకా॥ అమ్మా యీనాటికియేనూ। మరణానికి గుఱియైనానూ। యిమ్మహిలో నాకెవ్వరునీసమయమమ్మ తోడురాలేరూ ॥అమ్మా॥ నీదుశలవుగై కొనకవచ్చి నే నీగతిజెందితినికా। నాదుజనకు గోల్పోయితిచివరకు నాసర్వముకెడమైతీ ॥ అమ్మా॥ యెంతచింత జేసెదవోనాకొఱకు మంతనమందున నీవూ। కంతుజనకునకు కరుణలేకయీ పంతముబూనెనుమనపై ॥అమ్మా॥

తే॥ గీ॥ అమ్మరో నేడు నేను నీ యాజ్ఞగొనక
వేడుకతోవచ్చి మృత్యువు నోటబడితి
పాతకుడ నాకొఱకు దుఃఖపడగబోకు
వందనశతంబులర్పింతు యందుకొనవే॥

వ॥ అమ్మా! నీయానతిలేక వచ్చినందుకు నాకీయనుభవమయ్యెను నాకొటి కెంత యేడ్చెదవో తల్లీ.

(మాయాదేవినిగాంచి) హే దేవీ! లోకమాతా.

పాట॥ ఆకలిగొని యున్నావమ్మా। గ్వా। లోకజనని చేకొనవమ్మా। నీ। యాకలిదీరనుగదనమ్మా। యీకోమలతనువేసుమ్మా। ఓకరుణా మయి నా యడనీకెంతా కృపగలదే। నాకన్నాసుతుడని నను నీ కడుపులో దాచుకొనెదె ॥ఆకలి॥

ఆ॥ గీ॥ యెన్నినాళ్ళనుండి। అన్నహారములేక
ఉపవాస వ్రతము। నీ వూనినావొ
వ్రతసమాప్తి నేటి। వ్యాళ్ళనేకాబోలు
నన్నుగోరినావు। నాదురుధిరం॥

దర్వు॥ పానంబునకే కోరినవో। స్నానంబునకే కోరినవో। పూనియు గైకొనవే మాతా। నీ। బుద్ధిదీర్చుకొనవే మాతా। మాతా। మాతా। మాతా। మా...తా ॥ఆకలిగొని॥

(వత్సరాజునుగని)

వ॥ వత్సరాజా! తాబేదారుడవు నిన్ననవలసినది లేదు. మరియు నేను మృత్యువునకు వెఱగంది నీ యుపోద్ఘాతము చేయుటలేదు యెట్లనిన.

సీ॥ భువిపైజనించి నప్పుడె మృత్యుదేవత। వెన్నంటియుండునో యన్నవినుము। కర్మభోగములెంత కాలంబుయెవరికి। యెటులనున్న జరుగు నటువిధంబె। ఆపైనమృత్యువు ఆసన్నమయ్యెతా। గొనిపోవుగాని యెందుననువిడదు। నాదుజీవితము యీనాటికినీచేత। సరిపోయెనేమొ యీ ధరణియందు॥ తే-గీ॥ అందుకై యింతరాత్రి నన్నిందుదెచ్చి। చంప నుంటివిదానికై జంకులేదు। కొన్నివిషయంబులను జెప్ప గోరినాను। వినిన తరువాత నీయొక్క పనియొనర్చు॥

పాట॥ మేలుకొనుమన్నా। యిక ॥మేలు॥ కాలాహారణము గావించిన నీ మేలుచెడునన్నా ॥మేలు॥ చాలగ ధనధాన్యంబులునున్నా। సకల సుఖాన్విత సంపదలున్నా। మేలిమిబంగరు మేడలుయున్నా। గాలి పోవగా గనుయవిసున్నా ॥మేలు॥ పొట్టకూటికై ధర్మంబును బో

గొట్టిపాతకము గట్టుకొనుటకై । వట్టిగ ప్రజలను కొట్టితిట్టినీ । పొట్ట బోసుకొన పోసగదురన్నా ॥మేలు॥ యెంతసుఖముగా బెంచిన గాని । యేబదిసింహాములా బలుజేసీ । అంత్యకాలమున అరఘడి యేనీ । ఆగదుయీతను వస్థిరమన్నా ॥మేలు॥

ఉ॥ నిత్యముగాదు కాయమిది । నీటిని గన్పడు బుద్బుదంబుయీ
హత్యలు జేయకెవ్వరికి । హానియొనర్చకు నీకుయెప్పుడున్
మృత్యువు దప్పబోదువిను । మూర్ఖుడవై చెడిపోకునానుడుల్
సత్యములంచు నమ్మియును । సద్గుణముల్ గొనవోయిధీవరా॥

వ॥ ఇంతవఱకేదో జరిగినది జరిగింది కాని యికముందు యెవ్వరిని హత్య, హాని, నిందలు జేయ పాల్గొనకుము. అది మహాపాపము ఆ యమ భటులు కఠిన దండనంబొనరింపక కరుణించరు. కనుక నే జెప్పునది చెప్పితిని. ఆపైన నీయిష్టము.

మా పినతండ్రిగారి కొక్క మనవి. (అని రెండు మఱ్ఱియాకులు దెంపి వత్సరాజుదగ్గఱనుండి ఖడ్గముతీసికొని తన పిక్కనుగోసి రుధిరము దీసి నొకయాకుపై నేమియో వ్రాసి వత్సరాజుతో)

తే॥ గీ॥ సమయమును మించిపోయె । నిక జాగువలదు
వేగ నీచేయు పని । నెరవేర్చుకొనుము
దయ దలంచియు । నిట్టి పత్రిమ్ము గొనియు
నాదు పినతండ్రి కివ్వు । మానకను యిదిగో॥

(అని పత్రిమును వత్సరాజుకిచ్చి తలవంచి)

వ॥ అయ్యా! ఇదిగో సిద్ధముగానున్నాడను. యిక నీకర్తవ్యము కానిమ్ము.

(అనగా వత్సరాజు ఖడ్గమును పారవైచి భోజునికాళ్ళవయింబడి పెద్ద పెట్టున యేడ్చుచు)

సీ॥ భోజరాజేంద్ర యంబోరుహావదనన్ । పాలించు మతిఘోర ఘాతకుడను । అధమమహా విభవముల కాశించి నీ గొంతు । గోయ పాల్గొనినట్టి క్రూరమతిని । మాయాపిశాచి నా మరుగువిడిపోయె నీ। జ్ఞానోపదేశంబు గలిగినంత । నాదుప్రాణంబులున్నంత కాలము నీదు । క్షేమ

ప్రియత్నముల్ జేయువాడ ॥ గీ॥ న్యాయమార్గంబుచేత మీా నాన్నగారి। స్థానముఁ ముద్రినీదు స్వాధీనపరతు । రమ్ము యీారథముపైన గూర్చొమ్ము వేగ । సంతసంబున యింటికి జనుద మిపుడే॥

వ॥ దుర్మార్గుడగు ముంజుని బోధలకు లోబడి యీాహత్య చేయ బూనిన మహాపాపినగు నన్ను మన్నించి యీారథముపై గూర్చునుడు యింటికి పోవుదము బుద్ధిమంతులగు మీారు మడసిన యీా భరతమాత క్షోభించును.

(వాదం – వత్సరాజుకు – భోజునికి)

భోజు–పాట॥ వత్సరాజవినుమికయీా । తుచ్ఛమైన ప్రాణముపై । యిచ్ఛ నాకులేదునీవు వచ్చినపని జేసికొనుము॥ మచ్చికతో నన్నువిడచి పుచ్చిన యింటికిబోయితె । వచ్చునుకష్టంబుయిుంక హెచ్చుగమన యిరువురకును ॥వత్స॥

వ॥ అధికారి యాగ్రహంబునకు గురియయ్యెదవు నీవువిడిచిన ఆతడు వదలునా యెందుకీదుర్భ్రమ నీపని నీవు జూచుకొనుము.

వత్స–పాట॥ భయము లేదు ముంజుడు దుర్భావముగల వాడునిజమే ॥భయ॥ రయమునా రహస్యమందిరమున నిన్ను దాచియతని॥ నయనములకు గనపరచక నటియించెదనొకతీరు సమయమునువచ్చెడిదాక సుమానేవేచియునుందును ॥భయము॥

వ॥ మీాకు యేవిపత్తు రాకుండ నేజూచుకొనియెదను కరుణించి మీారు రాకతప్పదు అందుకు సమ్మతించకుంటిరా నేనుమాత్రము తిరిగి ప్రాణములతో యిల్లుజేరను.

భోజు–వ॥ ఓహో వత్సరాజా అటులైన నచ్చెదను పదుము నీ యిష్టమువచ్చినట్లు చేయుము.

(నిష్క్రమింతురు తెరవాలును)

4–వ రంగము – ముంజునిసౌధము.

(వత్సరాజు మాయాకల్పితమైన శిరస్సు నెత్తురుతో నిండిన గుడ్డలతో ముంజుని వద్దికి జేరును. ముంజుడు సంతోషంబున.)

పాట॥ సంతసంబుగూర్చినావు యిక వో। సచివరాగ్రగణ్యానామదికి బహు॥

సం॥ అంతరంగమిత్రమ నీవలె భువినంత వెదకిననుగాన బడదు ధీ। మంత నీవునాదు చెంతనుండుట కెంతో యేను ధన్యుండనైతిగా॥

వ॥ మిత్రమా! యిదిగో యీ పారితోషికము బహుమతిగా నొసంగుచున్నాడను గై కొనుము. (అని నొక హార మొసంగి)

మిత్రమా!

వత్స—వ॥ మహారాజా!

ముంజు—ఉ॥ చచ్చెడి వేళ బాలకుడు । సంగతు లేమయినన్ వచించెనా
అచ్చెరువందెనా మొదట । ఆలయమందున క ర్తిజూచియున్
హెచ్చుగ యేడ్చెనా మదిలో । హేజననీయని యార్చెనాయికన్
రచ్చకు దేలకుండ విన । రంబుగ దెల్పగదోయి మిత్రమా॥

వత్స—పాట॥ అధిపస త్తమా వినుడిక మీాయొక । ఆగ్రహంబునకు భీతిలి బాలుని ॥అ॥ వధయొనర్చితిని గాని హ స్తములు వణుకుబుట్టెరా వధ్యొద్యంచుటకు ॥అధిప॥

కం॥ భూవర నాతో యేమని
భావంబును విప్పలేదు । బరికింపంగా
చావకమున్నే యేదియొ
చేవ్రాలు లిఖించినాడు । చేకొనుమయ్యా॥

వ॥ నాకేమని చెప్పలేదు కాని ఇది మా పినతండ్రిగారి కివ్వుమని మాత్రము యేమోవ్రాసి యిచ్చినాడు చేకొనుడు. (అని పత్ర మొసగును)

(ముంజుడు పత్రము చదువుకొనుట)

సీ॥ అనువుగాకృతయుగం బునకునలంకార । భూతుడై నట్టి మాంధాతనృపతి । త్రేతాయుగంబున సేతువుబంధించి । రావణుజంపిన రామమూర్తి । ద్వాపరయుగమున ధర్మరాజాదులు । ప్రఖ్యాతిగాంచిన ప్రభువులకట । యెందరోనీభూమి యేలియుండిరిగాని । కనుగొనవారేగు కాలమందు॥ గీ॥ గొనియుపోలేదు వెంబడి గొంచమైన । నింతపేరాసముంజ యవనీశవినుము । నీవుజావంగనీభూమి నీదువెంట । స్వర్గమునకె రాగలదు నిశ్చయముగాను॥

(ఈ విధముగా చదివి దుఃఖాశ్రువులు విడుచుచు)

వ॥ హా కుమారా నేనెంతపాపిని రాజ్యకాంక్షచే నింతటి ద్రోహమునకు పాల్గొంటినిగదా. హా...(యని క్రిందబడును తెరవాలును)

ఇది శ్రీరంగనాయకుల వెంకటార్య ప్రణీతంబైన
భోజకాళిదాసు నాటకమందలి
తృతీయాంకము సమాప్తం.
శ్రీ శ్రీ శ్రీ

—( చతుర్థాంకము - మొదటిరంగము )—

ప్రదేశము - అంతఃపురము

ప్రవేశం — సావిత్రి — ( రాణి )

పాట॥ తనయా కానగరావా ॥తన॥ ననువిడిమెచటికి జనియున్నావో ।
నినుయేమంటిర దినమణితేజా ॥తన॥ నీజనకుడు లేకుండినగానీ ।
నిల్పితిప్రాణము నీపైనా ॥తన॥ భోజనవ్యాళ్ళయు మించిపోయెనిక
భోంచేయుగ రావేలా ॥తనయా॥

ఉ॥ యెన్నడునన్ను బాసియును । యెచ్చటికేగగ లేదుపుత్రికా
నిన్నటిరేయి నన్నువిడి । నిద్రయెటన్ గొనినావొ క్రూరులుఽ
నిన్నెటుగొంచు బోయినరొ । నింతయునాకెరి గించవైతివే
యెన్నగనీదు జాడలును । యేర్పడునెట్టుల పుత్రరత్నమా॥

వ॥ హా కుమారా యెటుబోయితివో యేమైతివోకదా.

తనయా ! తనయా...(అని వెదకుచు బోవును తెరవ్రాలును)

ప్రవేశం - పౌరులు.

శేషయ్య-వ॥ వరేవరే వాసయ్యా దాసయ్యా విన్నారా మోసం మోసం.

వాస-దాస-వ॥ శేషయ్యా యేమటయ్యా ఆమోసం.

శేష-వ॥ మనసింధులు భూపాలుని కుమారుండగు భోజుని ముంజుడు వత్సరాజుచే చంపించాడట.

వాస-వ॥ ఆఁ నిజమేనా.

శేష-వ॥ ఔను ఊరంతా ఉలికిపడుతుంటే నిద్దురోయినట్టడుగుతున్నావేమి.

దాస-వ॥ మోసమేకాదు పచ్చిమోసం యీ అన్యాయాన్ని తప్పక యెదిరించాలి పదండి.

శేష-వ॥ యెదిరించకపోతె వాదిలేత్తె బాగుంటుందా పదండి

(అని పోవుదురు)

దర్బారు ప్రదేశము - 2 వ రంగము
నగరవాస్తవ్యులందరు కోలాహలంగ యుందురు
శేషయ్య అందరిని చూచి

శే-వ॥ అయ్యా! ఓ మహాజనములారా యేమీ అన్యాయం.

పాట॥ పాపని జంపించుట తగునా। అయ్యా జనులారా। పరిపాలనయందె యిదేనా ॥అయ్య॥ యీపాటికె యెందరినో హింసలు జేయుచు నుండే। రేపటి కింకెంతయు చెలరేగుచుండు నీమూర్ఖుడు ।పాప॥ యెన్నాళ్ళుండినకీడేనన్నా వీడున్నా తన। యన్నా కొడుకేయని మన సన్నాబొరలనిదున్నా ॥పాపని॥ కరమొప్పగ వెంకటార్య కవి వరదుండైనా యీ। ధర వెంకటరావు ప్యాట ధాముని సాక్షిగ బల్కుడి ॥పాపని॥

వ॥ పరిపాలన లేకున్నాసరేగాని యిట్లాటి దుర్మార్గు నుంచకూడ దని నేనంటున్నాను. మీరేమంటారు అందరూసెప్పండి.

పౌరులు-వ॥ శేషయ్యగారూ! మీాయిట్టమే మాయిట్టం అందరం ఒప్పుకున్నామ్.

(ముంజుడు ఖిన్నవదనముతో - పౌరులగాంచి)

పాట॥ మన్నింపదగిన వాడగానూ। మహాజనములావినుడికనూ ॥మన్నిం॥ యెన్నరాని పాపాత్ముడయేనూ। యేశిక్షవిధించిన పాత్రుడనూ। అన్నలారవో అయ్యలార యెటులున్నదో శాస్త్రవిధిన్నెరగిం చుడి ॥మన్నిం॥ క్షాత్రధర్మమును పాలనసేయని। రాత్రిచరుల కన్న క్రూరమూయప। విత్రహృదయుడను విమలదేహుడా। పుత్రఘాతకుడ భూవలయంబున ॥మన్నింప॥

(పండితుల వంకజూచి - చేతులుజోడించి)

కం. బుధజనములార తెల్పుడి
విదితంబుగ ధర్మశాస్త్ర। విధియెటులున్నా
నదియనుభవించువాడను
అధముడ మన్ననలకేన। నర్హుడనైతిన్॥

వ॥ మహానుభావులారా! శాస్త్రప్రకారము శిక్షవిధించుడి మీా మన్ననలకు దూరమైన యీా పాపాత్ముఁడు అనుభవించుటకు సిద్ధముగా నున్నాఁడు.

(పండితులు ఒకరిమొగ మొకరు చూచుకొనుచుందురు)

శే-వ॥ యేమయ్యా! అప్పలశాత్తుర్లూ సూత్తున్నారెందుకు శాత్రి ప్రకారం సెప్పండి జోతిస్కంచూడండి.

(అప్పలశాస్త్రి శాస్త్ర పరిశోధనచేసి)

పాట॥ వినుమా శాస్త్రవిధినీ । మదినీ ॥విను॥ జననాయక యిక జాగూ సేయకను ॥విను॥ కనుగొనగను శిశుఘాతకుడును పురజనులకు మొగమును జనదుచూపగా । ఘనప్రజ్వలితము యనలములో బడి । యును వేగమె మృతియును బొందగవలె ॥విను॥ తిరుగు బాటులేదరయగ నీతలధరియింపగవలె తప్పకనూ । పరగను వెంకటరావుప్యాట యా।కరువలి సుతునకు కరములు మోడ్చియు॥

ఆ॥ గీ॥ పుత్రఘాతకుండు । భువిలోన యెవరికి
తనమోము జూపక। తక్షణంబె
అగ్నిలో బడియు మరణంబు । నొందుటకన్న
వేరులేదు శాస్త్ర। విధియునిదియే॥

(యింతలో రోష కషాయతాక్షుడై బుద్ధిసాగరు డేతెంచి – ముంజునిగని)

పాట॥ ఛీ తులువా । ఛీ పలువా.। ముఖంబుజూడరాదుగా ॥ఛీతు॥ ఘాతకుడా మడయుము వేగంబె నీ ముఖంబుజూడ । పాతకమబ్బునురా కులపాంసక భ్రష్టుడ నీచా ॥ఛీ॥ ధర వెంకటరావు ప్యాట పరిపాలకు డైనా । కే । సరి తనయుడు యెటువలెనిను కరుణించునురా ఖలమతి ॥ఛీ॥

ఉ॥ ఓరి కిరాతకాజనుల । కొప్పిదమైనది గాన నీవు యీా
పారులు జెప్పినట్టి విధి । బాలనసేయుము కారుచిచ్చులో
దూరియు చావుమింక ఘన । దుష్టమతీ విడరాదు నిన్నికన్
మేరయు మీాటి నీదు ముఖమెత్తియు చూపకుమో తురుష్కుడా॥

వ॥ మధ్యమలోకమందారకుండగు భోజుడు నీ యన్నకుమారుడని కనికరములేక దిగమిగ్రింగిన కఠిన కిరాతకా ఇక నీ ముఖంబు జూపక యీ క్షణంబే యగ్నిలో బడిచావుము. (అని పెడలిపోవు చుండును)

(యింతలో వత్సరాజు బుద్ధిసాగరు నద్దగించి)

వత్స—పా॥ బుద్ధిసాగరా । యెద్దిభయములేదా మన ముద్దుల భోజునికీ ॥
వో । బుద్ధి॥ అద్దురాత్ముకునికి యెన్ని సుద్దులుజెప్పిన నీచపు ।బుద్ధి
విడువలేక నన్ను గద్దరించి మిక్కుటకో ॥ పొద్దీసిత మానసుడై
పొలుపొందగ బాలుని । నిశి । ప్రొద్దున యొరు లెరుగకుండ పొలు
మరుసందునగలయా ॥ పెద్దలొద్దిలోవటయవ నీరుహావద్దనున్నగుడి
లొద్రుంచుమననది। రద్దుపరచి యింటికిగొనివచ్చితి సద్దుసేయకుడి
కొద్దిదినంబులు ॥బుద్ధిసాగరా॥

అ॥ గీ॥ కుటిల చిత్తునాజ్ఞ । కును జంకి బాలుని
గొంచుబోయి నేను । దుగ్రించకుండ
నొరు లెరుంగనట్టి । మరుగైన స్థలమున
నుంచినాడనే స । మంచితముగ॥

వ॥ మీ క్రోధావేశమును శాంతించుడు భోజుని మద్గృహంబుననే రహస్యముగా నుంచినాడను.

బుద్ధి—పాట॥ నీపుణ్యామేనయ్యా । నాకు । జూపింపగదయ్యా ॥నీపు॥ యే
పాప మెరుగనియా పాపనీ । కాపాడినావు మహోపకారివి ॥నీపు॥
అహోదయానిధి మహానుభావా । జోహారులివె మెచ్చోటుంచి
నావో ॥నీపుణ్యామేనయ్యా॥

తే॥ గీ॥ మధ్యమాలోకమందార । మనగదగిన
ధారనగరంబు పద్మ । బాంధవుడుమైన
భోజు నెచ్చటనుంచితో । బొలుపుమీర
నాదుకనులకు జూపు । నిన్నాశగ్రియింతూ॥

వ॥ సుకుమారుండగు భోజు నెచ్చట దాచినావో ఒక్కసారి నా కన్నులకు జూపెట్టుము నీకు చాలా పుణ్యముంటుంది.

వత్స—వ॥ సరి బుద్ధిసాగరా! చూపెట్టెదను రమ్ము. (అనితోడ్కొని

పోయి భోజుని జూపినంత బుద్ధిసాగరుడు సంతోష స్వాంతుడై వత్స రాజుతో)

బుద్ధి-వ॥ వత్సరాజా నొక్కవిచారము.

వత్స-వ॥ బుద్ధిసాగరా అదెట్టిది.

వాదం.

బుద్ధి-పా॥ వలదూ యిక జాగూసేయవలదూ॥ తెలియపరుచగా వలెనుమ్మి భోజుని ॥వలదూ॥

వ॥ యిప్పుడే భోజుని ముంజుని కన్నులకుజూపి మాటలచేత మెప్పించియో పురమునుండి ముంజుని బాఱదోలియో భోజుని పట్టాభిషిక్తుని జేయుట మంచిది.

వత్స-పా॥ యెటులా యేర్పడాజేయు టెటులా॥ కుటిలాత్మకుని మనసెటు లొప్పు ॥యెటు॥

ఆ-గీ॥ చచ్చినట్టివాడు వచ్చెనెట్టులయన । బిక్కమొగముకన్న దిక్కుగలదె । అపుడునన్నుజూచి యాగ్రహమొందును । గానభోజుజూపు కరణియెటులా॥

వ॥ భోజుని చంపుటకు నేనేగొనిపోయి ఆనవాలుకూడా తెచ్చి చూపెట్టితిని యిప్పుడు భోజుని జూపించుటెట్లొప్పును.

(బుద్ధిసాగరు డాలోచించి అయితే...)

పాట॥ ఉపమూ । నొకటున్నాదిదుగో వినుమూ॥ కపటా మాయావిని గల్పింపగావలె ॥ఉపమూ॥

వ॥ యిందుకు నొక్క ఉపాధిగలదు.

వత్స-వ॥ అదెటుల.

బుద్ధి-కం॥ ముందుగనొక మాయావిని
బొందుగ నేర్పఱచియిట్టి । భోజుని మనముక్
మందసమందున నుంచియు
అందఱికిని జూపవలయు । హావనములోనన్॥

వ॥ ఇంద్రజాలముచే నిట్టిపని నెరవేరును కావున అవన్నియు నేనే బొందుపరచెదనురమ్ము.

వత్స—పా॥ మదికీ । బహుముదాపహాము నీ విధికీ ॥ పనూమికను యేర్ప
రచుద మటువలె ॥మదికీ॥

వ॥ సరి చాలాబాగుంది పదండి. (అని భోజుని దీసికొని నిష్క్రమింతురు)

3—వ రంగము – నగరబాహ్యప్రదేశము.

(ప్రజలందరు చూచుచుండగా ముంజుడు అగ్నిగుండమును సమీపించి)

వ॥ హే! అగ్నిదేవా యిదుగో యీ పాపాత్ముని గూపసహిత పాపములను ఒకేసారి భస్మీపటలం బొనరింపుము యిదుగో చేకొనుము.

పాట॥ నీలో ననుజేర్చుకొనుము జ్వాలదేవా । యిక । మేలుజేయు మెల్ల
రకును జ్వాలదేవా ॥ యిక మేలుజేయు॥ జ్వాలదేవా । జ్వాల
దేవా । జ్వాలదేవా॥ (అని చుట్టుతిరుగుచుండును)

(యింతలో నొక మాయావి వచ్చుట)

మాయా॥ శంభో హరహర మహాదేవ (అనగా అందరుచూచెదరు)

మాయా—పాట॥ దురాశదుఃఖమెకదురా । చనదురా నీలో గనుమిదిరా॥
పరాత్పరుని లీల దెలియగానీ తరంబౌనయో నరాధమాయిక॥దు॥
మదించి రేయించరులూ । అల । మడయలేద పామరులూ ।
ముదంబుతో మధుప్రద్రావగాజని। వృథామరణ మొందదానీగయు॥
దురా॥ ధరణ వెంకటారావూ । పురి । హరిన్ దలంచగలేవూ ।
దురూబుద్ధిమాని వెంకటార్యా । వరాదూని కరుణ వడయవేరా॥

శ్లో॥ క్షణం చిత్తం క్షణం విత్తం । క్షణం జీవిత మావయోః
యమస్య కరుణానాస్తి । కాలస్య కుటిలాగతిః॥

వ॥ ఆగుమాగుము ఆత్మహత్య మహాపాపము.

(ముంజుడు మాయావినిగాంచి)

తే—గీ॥ భస్మలిప్తాంగమీకిదో ప్రణుతిజేతు । నేమహాత్కార్య మీదాసు కేర్పరించ । గానుయరుదెంచినారొమీ గరుణవెలయ । దెల్ప వేడుచునుంటి మహాదేవరూపా॥

(అని నమస్కరించి)

వ॥ దేవా చావసిద్ధముగానున్న యీదాసునిచే నేఘనకార్యము జేయించుటకై యెచ్చటినుండి తామిందు విచ్చేసితిరో తమనివాస స్థల మెయ్యదియో తెలుప వేడుచున్నాడను మహానుభావా.

మాయా—కం॥ ఈశ్వర తత్వోపరులకు
శాశ్వతమైనట్టిదొక్క । స్థలమునుగలదే
విశ్వము జరియించుచు భూ
మీశ్వరనిట కేగుదెంచి । మిముగనసైతిౕ॥

వ॥ ఈశ్వరతత్వ మెరింగిన వారలకు నొకస్థానముకలదా అంతటను సంచరించుదుము...మహాదేవ.

యింతలో భోజునితల్లి దుఃఖమయ క్రోధముతో
పరుగున యరుదెంచి.

(ముంజుని – వత్సరాజును గాంచి)

పాట॥ నాతనయుని దిగమ్రింగిన పాతకులారా । ఘాతుకమయముగ నీ
పురి గావించెదరా । గావించెదరా । యిక । జీవించెదరా । మీా
వినాశమున కిటులా మీాఱియుంటిరా ॥నాత॥ (ప్రజలనుగాంచి)
చూచుచునున్నారుమీారు సుతవిహీనులా । యిది। రాచపాడియా
యననోరాడదేమిలా। యోచనలేలా।యీాత్రాచుపాములా । పీచ
మడచి యెల్లరకును ప్రియమిడరేలా॥

ఉ॥ గ్రామములోన యిట్టి పెను । ఘూతకులుండిన మీాకు యింకనుౕ
క్షేమము గల్గునా సుఖము । జెందెదరా నరజన్ములార మీా
పామరమేల యుండరొక । భావముచేతను యున్నవారనే
తామసవాక్షరంబులిడ । తత్ఫలమెట్టుల దప్పకొందురో॥

వ॥ యింకేమున్నది మహారాజును దివికంపి యీా నగరంబును మంట గలుపనున్నారు యిట్టి పవిత్రమైన నగరంబులో పాపాత్ములుండ రాదు కావున అంతయు భస్మీపటలంబౌగాక.

(యింతలో మాయావి) వ॥ దేవీ శాంతించుము శాంతించుము శాంతము సర్వత్రి విజయము.

(బుద్ధిసాగరుడు) వ॥ ఔమతల్లీ యీామహాత్ముని వచనంబులు మహాప్రసాదమని తలంచుము. (మాయావితో)

పాట॥ కరుణించుమయా యోమహాత్మా । తవ । కరుణారసమున కాశించి
తిమిరా ॥కరు॥ పరామేశ్వరా స్వరూపమీారరూపెంచ రూరికె
మిాలో । పరమాద్భుతశక్తిచేత యెందరీనేలియున్నవారలో॥కరు॥

వ॥ యేదేని మహాత్మ్యంబులేక తమబోటి మహానుభావు లూరికె
రారు స్వామిా.

మాయా—వ॥ లేకేమి.

చం॥ గరళము దాగ్రివిఖ్యాతమైన నుర । గంబులకాటుచె గ్రమైనగ్రిచే
నరుకునుబొందిద్గమైన మర । ణంబునుగాంచిన వారలుండిన౯
సరగునలేపువాడ నిది । సత్యముయిందులో [illegible]యుండిన౯
పరగనుదెండు యీాసభలో । పాటినిజూపెద నామహాత్త్వము౯॥

వ॥ యీావిధంగ మరణించినవారి శిరమునరకే యుండిననుజాలు
పునరీవితునిగా జే[illegible]దను ఉన్నారా యెవరైన.

ముంజుడు॥ మహాత్మా! మహాత్మా!

ఆ—గీ॥ అగ్రిజుసూనుని హతమొనరించిన । పాపాత్ముడనునాదు
ప్రార్థనవిని । బ్రతికించుమయ్యా యబ్బాలుని వేగమె । పట్టివిడువనుమిాదు
పాదములనూ॥

వ॥ మా యన్నకుమారుడు కత్తివేటునమరణించి శిరముమాత్రమే
యున్నది అట్టిబాలుని లేపుడిస్వామిా. (అని పాదములు పట్టుకొనును)

మాయా—వ॥ అటులనే లేపువాడనుగాని యిచ్చట నొకగుడారము
వేయించి వలయు పూజాద్రవ్యములు దెప్పించుము నేను హోమము
చేసెదను నీకోరిక ఫలించును.

ముంజు—వ॥ చిత్తము స్వామిా. (అని బుద్ధిసాగరుని గాంచి)

పాట॥ సుగుణభరణ బుద్ధిసాగరా । నిను । బొగుడజాలనయ్యా ధీవరా॥
సుగు॥ తగినవస్తువులను గూర్చుమికనను । పగవానిగ నెన్నగ
వలదూ వో ॥సుగు॥

వ॥ బుద్ధిసాగరా నానేరంబులు దలంచక భోజుని పునర్జీవితార్థమై
వలయు వస్తువులను నీవే సమకూర్చుటకు నేప్రార్థించుచున్నాడను.

బుద్ధి–పాట॥ సరెనుమంచి దటువలెగూడ్తా । కే । సరితనయుని నుడువగ నేస్తా ॥సరె॥ పరగభోజుడే బ్రతికినయింకే । కొఱతలుండవందరికి మేలెయుగు ॥సరెను॥

వ॥ అటులనే యొనరించువాడను.

(అని యచ్చట నొక గుడారము వేయించి పూజాద్రవ్యములతో నిండినపెట్టె నొకటి దెచ్చిపెట్టును – మాయావి అందులోకూర్చుండి)

పాట॥ శ్రీదేవదేవా మహాదేవ దివ్యప్రభావా । విరూపాక్ష । విశ్వేశ । కలికల్మషానాశ । రుద్రాక్షమాలాధరా । శూలపాణీ । హరా । శంభులింగాంతరంగా శుభాంగా శివావృషతురంగా భుజంగా । విభూషాగిరీశా । మహేశా । భజేపార్వతీశా । నమోసత్యగంగాధరా । వ్యాఘ్రచర్మాంబరా । భూతనాథాయ ఓంకార మంత్రస్వరూపా । సదానందనీపాద బృందంబులన్ నాదుడెందంబునన్ నమ్మితిన్ దీనబంధో దయాసాగరా । వేగరారా । నమస్తే నమస్తే నమః ॥

(యిటుల చదువుచు పెట్టెలోగల భోజుని యొరులెరుంగకుండ బయటికి దీయును – ప్రజలందరు సంతోషస్వాంతులై )

ప్రజ॥ జై శ్రీ భోళాశంకర్ కూ జై జై మహాత్మకుజై జై యువ రాజు భోజరాజుకూ జై...... (అని జయనినాదములు సేయుదురు)

(ముంజుడు ప్రజలతో)

వ॥ ఓ మహాజనములారా! యిదుగో రాజముద్రను భోజునికొసంగుచున్నాడను యీ సింహాసనాధిపత్యము భోజునిదే యిక నేను సాధువేషముచే కట్టుగుడ్డలతో కాననమున కేగుచున్నాడను మీకందరికి వందనములు. (అని వెళ్ళిపోవును)

(అనంతరము భోజుడు సింహాసన మలంకరించి – ప్రజలతో)

వ॥ మహాజనములారా యీ వత్సరాజు మహోనేర్పరి నన్ను గాపాడినాడు కావున యీతనికి కొన్ని గ్రామములు అగ్రహారముగా నివ్వనైనది రెండవది అగ్రయమాత్యపదవినుండి తొలగింపబడిన బుద్ధిసాగరుని యథాస్థానము జేర్చనైనది యిందుకు మీ యభిమత మేమి.

ప్రజలు—వ॥ మహారాజా! ప్రాయము చిన్నదైనా పలుకుబడి గొప్పది మీ యౌదార్యమునకు మీబుద్ధికుశలతకు భగవంతుడైనా యంగీకరించక తప్పదు. (నిష్క్రమింతురు - తెరవాలును)

4-వ రంగము - ప్రవేశం - సుబ్బయ్య

(తెరచాటునుండి) ఈయవ్వాకోలతిల్లి ఈయక్కాకోలతిల్లి ...... అనుకుంటు వచ్చును. (సుబ్బయ్యగాంచి)

వ॥ అదేమటారి యెవరిని తిట్టేది.

సుబ్బ—పా॥ ఓ నాన్నసూడే యీ నంజకొడుకుల నేనేమి యనలేదూ నన్ను గొట్టారో॥ నాన్న॥

వ॥ నేనా దారినపోతూంటె ఊరక నేమొన్న బొంగరాలెత్తుక పోయినావని సావదన్నారే......(అని యేడ్చును)

(సుబ్బయ్య కోపముతో)

పాట॥ విప్రకులంబునబుట్టి అప్రయోజకుడవైతివి। నా ప్రారబ్ధంబిదియిక నా యింటానుండతగవు॥ యేపోలునో యెచ్చటనో నీ ప్రాణము గాపాడుకో। లేప్రాయుడవా నీకికలేశమైన బుద్ధిరాదు॥ విప్రకులం॥

వ॥ ఓరీ నీతో నేనేగించలేను యిక నాయింట నుండక యెటకైన వెడలిపొమ్ము. (అని కొట్టి వెడల గొట్టును)

(ప్రవేశం - అచ్చిగాడు)

వ॥ ఓన్ అచ్చి! అచ్చి.........పిలిత్తె పలుకదే దీంతల్సిగ్గొయ్య యాడికెల్లిందో సూశొత్తా.

పాట॥ లచ్చన్న రామన్న బుచ్చన్న మాయాడిదచ్చింద మీ యింటికాడున్నదా ॥లచ్చ॥ పచ్చిబాలకైతె మచ్చుకేపోదామె। అచ్చటిచ్చట నేను తెచ్చి పెడుతావుంటె। పచ్చియెచ్చాజేసి సచ్చంగ దింటాది। అచ్చికూకుంటాది ముచ్చట్లు బెడుతాది ॥లచ్చన్న॥

వ॥ ఓర్‌లచ్చన్నా ఓర్‌బుచ్చన్నా మీ యింటికాడ మా యాడి దున్నాదటారి:

(అనుచుపోవును)

(ప్రవేశం అచ్చి)

పాట॥ పోశక్కా ఆశక్కా కాశక్కా నామొగడచ్చిండమీాఇంటికాడున్నడా॥
కూశంత యెరుగడూ। కులకస్పియెన్నడూ। మీాసాలుదూత్తాడు
యేశాలు యేత్తాడు। పోసుకోనొత్తాడు పోంకాలు గొడ్తాడు॥పో॥
వ॥ వో పోశక్కా! ఆశక్కా! మీాయింటికాడ మూమొగైను
న్నాడే. (అనుచు పోవును)

(పునఃప్రవేశం - అచ్చిగాడు)

వ॥ యేడసూసినాలేదే నాకేమాకలేత్తోంది. దీనియమ్మ నేనన్న
యేసోక్కా న్తింటాను.........(అని యింట్లోకి వెళ్ళి)

పాట॥ నాలుకాస్పైలేక నంజుడంటాదెత్తె। ఆలాయముగజిమ్మ లండి పా
రేసింది। కాలజెముడూ అచ్చిగాడంటె యేమైన। తాలుబోలను
కున్నదా తల్లి సిగ్గొయ్య॥లచ్చన్న॥
వ॥ జిమ్మల్ తినితిని జిమ్మరుసే తేలిపోయింది ఇయ్యాల్ల నంజు
డంటుమంటే మల్లా జిమ్మలే అండేసింది యిదోడుదినాలె దాన్నే పట్టు
కొచ్చి తినిపిత్తా॥ (అని పోవును)

(పునఃప్రవేశం - అచ్చి)

పాట॥ నిత్తెనంజుడు కూర దెత్తాడు కంచుట్ల। కాత్తమిగులకుంట కమ్మంగ
దింటాడు। మత్తికెక్కి రేపు మాపన్న దెరుగడూ। బొత్తిగా
అన్నాల మెత్తుకున్నాడేమె॥పోశక్క॥
వ॥ బాగాకల్లు మాంసంతోని కైపెక్కి ఉంటాడు యిట్టంవొచ్చి
నట్టు తిరుగుతాడు. (నిష్క్రమించును)
(నొక వీధిలో అబ్బయ్య కూర్చుండి యుండును. అచ్చిగా డచటికి
వచ్చి అబ్బయ్యను గాంచి.)

అచ్చిగా-పా॥ సిన్నోడ మీారోల్లురా। యిక్కడగూకున్నావు యేపల్లెరా॥
యిక్కడ॥ ఉన్నార నీకెవ్వలన్నా యీా వూరిలో। పన్నుగ
యెక్కడికి పైనముజేత్తున్నావు॥సిన్నోడ॥
వ॥ సిన్నోడా మీారోల్లు యాడికెల్తున్నావ్ యిక్కడ నీకెవ్వల
న్నున్నారా.

అబ్బ-వ॥ మరి మీారోల్లు. అచ్చిగా॥ మేమెరుకులం.

అబ్బ-పాట॥ కులమై తెవొక్కా-టేనూ। మాపూరు। దెలువాడు మెక్కా-
రనో ॥మాపూరు॥ తెలువదు యేవ్వూరి కెలుతానో యీపూల్లె।
తెలిసినవోల్లూ చుట్టాల్ కూడ లేరయ్యా ॥కుల॥
వ॥ నాకిక్క-రెవ్వరు లేరు యారికిబోయ్యేది నాకేం తెల్దు.

అచ్చి-పాట॥ అవ్వాఅయ్యా ఉన్నారా। ఇయ్యాల్ల। బువ్వేడదిన్నావురా॥
ఇయ్యాల్ల॥ తోవ్వాదారెరుగావు తోడెవ్వరూ లేరు । నువ్వుబో
య్యేదన్న మెవ్వూరో మెరుగావు ॥అవ్వా॥
వ॥ మరినీకు అవ్వా అయ్యా ఉన్నారా ఇయ్యాల్ల బువ్వెక్క-డ
తిన్నవ్.

అబ్బ-పాట॥ మూడూరోజులాయనూ। యిందాక। కూడూకుమ్మొ మెరు
గనూ ॥యిందాక॥ యాడమెవ్వాలన్న నీడాకుదీసితె । ఆడానె
వుంటాను అవ్వాలేదయ్యాలేడు ॥మూడు॥
వ॥ మెక్క-డెవ్వలు దగ్గఱతీత్తె అక్క-డేఉంటాను.
అచ్చి-వ॥ మరిమేం కొడుకుకొమ్మా లేనోళ్ళం మాయింటికాడుం
టావా నిన్ను మంచిగ సూస్కు-ంటాం.
అబ్బయ్య॥ ఆఁ ఉంటాను పెద్దయ్యా.
అచ్చి-వ॥ మాయింటికి పోదారాం. (అని దోడ్కో-నిపోవును)

(అబ్బయ్యతో పునఃప్రవేశించి)

అచ్చిగా-పా॥ అచ్చీయిాన్నిదీసుకోయే। సాన। మచ్చికతో జూసుకోయే।
గుడ్డి। పచ్చిలాగుంటావుగావే।పొరుగుముచ్చాట లాడాబోతావే।
నీకు। తెచ్చినవే తోడు లచ్చనముగోలె ॥అచ్చీ॥
వ॥ అచ్చీ! యింగోయే.
అచ్చి-వ॥ ఆఁ ఆఁ మల్లెందో బారెంజేస్కు-చ్చిండే.

పాట॥ రొక్క-మెంత బోసినావు। యీన్ని। మెక్క-న్నుంచిదెచ్చినావు।
మెక్క-డెక్క-డనో దిర్గుతావు। పెద్ద। లెక్క-పోకడబోయ్యేదావు।
లేని।దొక్కాటి దెత్తావు దిక్కు-మాలినోడ ॥ రొక్క-॥
వ॥ మెక్క-డెక్క-న్నో దిర్గి యేదోటి దెత్తావు। మెంత డబ్బుదగి
లెట్టినావు యీందేంకులం.

అచ్చిగా-పాట॥ రొక్క-ములేదవ్వతోడే । యీడు । దిక్కు-దీములేని

పోడే । మనకు । ఫుక్కాని కేదారకినాడే। బట్టలొక్కటి మనతోని
బుక్కడు బువ్వకాదె ॥రొక్కము॥

వ॥ రొక్కం ఇయ్యలేదు ఇచ్చేదిలేదు దిక్కుదీములేనోడు బట్ట పొట్టయేత్తె సచ్చినట్టు పడుంటాడు.

అచ్చి-పాట॥ అట్టయితె మంచీదెరారా । నీ । బట్టకు పొట్టాకు యినరా।
యింకెట్టీ లోటులేదురా । మా । యిట్టాను సారంబు యింటీ
పనుల్ సెయ్యి ॥అట్టయితె॥

వ॥ చెప్పినట్టు యింటావా ?

అబ్బ-వ॥ ఆ యింటాను పెద్దవ్వా

అచ్చి-వ॥ దా బువ్వతిందువ్. (నిష్క్రమింతురు)

(4వ రంగము - ప్రవేశం - సత్యవంతుడు - నీతివంతుడు)

(ప్రదేశం - వంగరాష్ట్రము)

సత్య-వ॥ అమాత్యశేఖరా నీతివంతా.

నీతి-వ॥ మహారాజా యేమియాజ్ఞ.

సత్య-పాట॥ సచివరమన పురజనములు సంతసమున నున్నారా । వచి
యింపుము యెల్లరునిజ వర్తనులై చరియింతురర ॥సచి॥

చం॥ రిపుభయమేమిలేకకుల । రీతులదప్పక యెల్లవారలున్
కపటములేక నేవిధము । కష్టములొందక సర్వసౌఖ్యముల్
కపికులశ్రేష్ఠు సత్కృపను । గాంచుచునుండిర క్షేమవంతులై
విపులముగాను దెల్పుమిక । విందునువీనుల విందుగొల్పగా॥

వ॥ మననగరంబులో యేమికొంతలులేక యెల్లరు కుశలంబున నున్నవారలేనా.

నీతి-పాట॥ సత్యవంతభూపాలా । సద్గుణగణ ధీలోలా । నిత్యవైభవముల
తోడ నిడుములులేకను యున్నరు ॥సత్య॥

ఉ॥ ఎల్లరియందు ప్రేమయును । యేర్పడనేక విధంబులైనమీ
చల్లనిపాలనంబునను । సంకటముల్ యెదిరింపనోపునే
వల్లభవంగరాష్ట్రమును । వర్ధిలుచుండెను కీర్తివంతమై
యెల్లరినోళ్ళమిమ్ములను । యెన్నడుమానరు రాజచం

వ॥ ప్రభూ! యేమికొఱంతలు లేక యెల్లరు క్షేమముగనేయున్నవారు.

సత్య-పాట॥ సర్వకాలములయందున సర్వేశ్వరు కృపగోరితి । సర్వమంగళ నిటకును సత్వరమున రావింపుము ॥సర్వ॥

వ॥ మత్కుమారీ రత్నంబగు సర్వమంగళ నిందు రావింపుము.

నీతి-పాట॥ మంచిది యటువలెనే రావించెద భూనాయక సరి॥ అంచితముగ నేతల ధరియించువాడ మీయానతి॥ మంచిది॥

వ॥ అటులనే రావించువాడను. (అని లోనికిపోవును)

(ప్రవేశం - సర్వమంగళ సత్యవంతునిగాంచి)

సర్వ-పాట॥ జనకా యరుదెంచితీనికా ॥జన॥ వినజేయుడియే పనిగల్గెనో॥ జనకా॥

వ॥ జనకా! నన్నిందు రావించిన కారణమెయ్యది.

సత్య-పాట॥ అమ్మాయీ! నీవివాహం ॥అమ్మా॥ సమ్మతితోడను సల్పబూని ॥తమ్మాయీ॥

వ॥ అమ్మాయీ నీ పెండ్లి విషయమై ఆలోచిస్తున్నాము కనుక నిన్ను రావించితిని.

సర్వ-పాట॥ అదియుగా నన్నడుగుటేలా॥అది॥ మదికిసిగ్గు యేమనుదానను॥ అదియూ॥

వ॥ మీరా మాటంటే నాకు సిగ్గౌతుంది నన్నడగట మెందుకు.

సత్య-పాట॥ చదివినా చదువుచాలూ ॥చది॥ వదలుమికను గురువరుకు దెల్పి ॥చదివినా॥

వ॥ యిక గురువుగారికి కట్నమర్పించి నేటినుండి నీవిద్య మానుకొనుము.

స-వ॥ సరి మీ యిష్టానుసారంబే గురువుగారి శెలవంది వచ్చెదను.

(నిష్క్రమింతురు)

ఇది శ్రీరంగనాయకుల వెంకటార్య ప్రణీతంబైన

భోజకాళిదాసు నాటకమందలి

చతుర్థాంకము సమాప్తం.

శ్రీ శ్రీ శ్రీ

భోజకాళిదాసు నాటకము - పంచమాంకము.

1 వ రంగము - పాఠశాల - బాలురు

మృదంగం-వ॥ ఒరే సారంగం తారంగం.

సారం-తారం॥ యేమటా్రి మృదంగం.

మృదం-పాట॥ పంతులురాలేదుయింక యింతలోన కొంతసేపు।బంతియాట లాడుదాముురా । బాలకులారా ॥బంతియాట॥

వ॥ పంతులు వచ్చేవరకు కొంతసేపు ఆడుకుందాంరండి నావద్ద బంతిగలదు.

సారం-పాట॥ పంతులురాగానెమనము పాఠమొప్పజెప్పకుంటె । తంతడు కోదండామేసీ । పడేసీ ॥తంతడు॥

వ॥ ఆటలాడితే పాతాలోస్తాయా పాఠా లొప్పజెప్పకపోయితె పంతులుగారొచ్చి తన్నడూమరి.

తారం-పాట॥ పొద్దుబొయ్యేదాక రాడు । తద్దినమువారియింట్లొ । ముద్దు గాను జదువవచ్చురా । పోదాముురార ॥ముద్దుగాను॥

వ॥ పంతులుగారిప్పుడే రాడురా యివ్వాళ్ళ వాళ్ళ నాయిన్నమ్మ తద్దినమటా కూరగాయలకై తోటల్లోకి వెళ్ళాడు బాగా చదువొచ్చురా.

సారం-పాట॥ ఐనవచ్చెదానుబంతి యాటనాకురాదు వేరేమైన యాడుకుం దాముురా । విన్నారా ॥వేరేమైన యాడుకొందాముురా॥.

వ॥ అట్లయితె వచ్చెదనుకాని నాకు బంతియాటరాదు యింకే మయిన ఆడుకుందాము.

మృదం-పాట॥ గోటీలుబట్టుకోని సూటిగానుపంతుల్ గారి తోటాలోకీ బోదమూ । మనమూ ॥తోటాలోకీ॥

వ॥ పంతులుగారి తోటలోకివెళ్ళి గోటీలాడుకుందాముురా.

సారంగ-వ॥ నావద్ద గోటీలు లేవుమరి.

మృదం-వ॥ మొన్న బొప్పా వెంకటనరుసయ్యావి యెత్తుకొస్తివి గదరా.

సారం-వ॥ బొప్పా వెంకటనరుసయ్యా యెవరురా.

మృదం-వ॥ కిట్టయ్యపటేలు మనుమడురా రాజన్నసార్ కొడుకు,

సారం-వ॥ ఓహో ఔను నేను చిర్రిగోనె ఆడుకోంగ నాచిర్రి పగులగొడితె నేనాయన గోలీలెత్తుకొచ్చినాను.

మృదం-వ॥ మరవ్వేంజేశావ్.

సారం-వ॥ బలుపం లేకపోయితే మాఅమ్మ పైస ఇవ్వలేదు అవ్వి గురువయ్య పఠేల్ కిచ్చి బలుపం తెచ్చుకున్నాను.

తారం-వ॥ సరేకాని మీమాటల్లోనే యింతపొద్దాయె యింకెప్పుడూ ఆటా.

మృదం-వ॥ అదుగో పంతులుగారు రానేవచ్చారు యెక్కడివాళ్ళక్కడ కూర్చుండి చదువుకొనుడి. (అందరు కూర్చుందురు)

ప్రవేశం - పంతులుగారు.

పంతు॥ ఓరేయ్ మృదంగం నీపద్యమేదీ,

మృదం॥ నాపద్యమండీ చదువరిగాడిదే సత్యముగను.

పంతు॥ యేమటారి చదువరిగాడిదేంటి నీతలకాయి.

మృదం॥ ఔనండీ అంతేచెప్పారు.

పంతు॥ యేదీ చదువుము.

మృదం-గీ॥ చదువులెన్నోచదివి సద్గుణంబునులేక । చదువులో సన్మార్గ సరళిగనక । చదివినదానిలో సారంబుదెలియక । చదువరిగాడిదే సత్యముగనూ॥

పంతు॥ ఔను చదివినంతనే లాభమేమి నీకాపద్యమెవరుజెప్పినరు.

మృదం-వ॥ మొన్న మనగ్రామమునకు వచ్చియున్న శ్రీరంగనాయకుల వెంకటార్య కవీంద్రుడు చెప్పినాడండీ.

పంతు॥ సరి తారంగం నీపద్యమేదీ.

తారం-వ॥ నాపద్యం సర్వమంగళ పలకమీద వ్రాశానండీ యింక సర్వమంగళ రాలేదు నేను జ్ఞాపకం చేయలేదు.

పంతు॥ వరేసారంగం నీపద్యమేదీ.

సారం॥ నిన్న పద్యాలవ్వాళ్ళకే మాయమ్మ అలం కొత్తిమీరు తెమ్మని అంగడికి పంపినాదండీ నిన్న నేను రాలేదు.

పంతు॥ సరి కూర్చొనండి.

పిల్లలు॥ పంతూల్ నీడ కొయ్యమీదికెక్కింది అంబటాళ్ళయింది.
పంతు॥ మంచిది వెళ్లుడు. (పిల్లలందరు పోవుదురు)

(యింతలో సర్వమంగళ యేతెంచును)

పంతు-వ॥ యేమీ సర్వమంగళా యిప్పుడా నీవు బడికిరావడం.

—( వాదం )—

సర్వ-పాట॥ వందనము లాచార్యమీపద బృందములకును నిండుగా ।
మందిరము విడనాడకుండూ మనిమెమాజనకుండుగా ॥వంద॥

వ॥ గురువర్యా యికనేనంతఃపురము దాటిరావలదట మానాన్న గారు విద్యమానుమని యన్నారు.

పంతు-పాట॥ మానినీమణి విద్యనెందుకు మానుమనియెనో తెల్పుమా॥
లేనిపోనీ మాటయావో । లేమసత్యము బల్కుమా॥ మానినీ॥

వ॥ సర్వమంగళా! మీనాన్నగారు చదువునెందుకు మానుమంటాడు. నాతో అబద్ధ మాడుచున్నావు.

సర్వ-పా॥ గురువరా మీతో నబద్ధముకూడునాయిల నాకికా ॥ పరిణయంబట దక్షిణల్ యర్పణము యిదే చేకోనుమికా ॥గురు॥

గీ॥ యుక్తప్రాయంబు గలిగిన యువిదనుగద । వివహామింతలోప లనె గావించెదరట । గాన చదువునుమానుట కాజ్ఞయొసగె । గొనుడి గురుదక్షిణల్ యివే గోర్కెమీరా॥

వ॥ యిదుగో గురుదక్షిణగై కొని నన్నాశీర్వదించి పంపుడు.

పంతు-పాట॥ నారిమణి యీ కానుకలునే । కోరగాలేదూసుమా ॥ వేరె
నొక్కటి గోరితీనది వేగమే నెరవేర్చుమా ॥నారి॥

వ॥ తరుణీ యీ గురుదక్షిణ నాకేమివలదు నీకరుణయున్నయడ. నా విరహతాపము దీర్చుము నిన్ను పరమేశ్వరుడు రక్షించుగాక.

(సర్వమంగళ కోపముతో) వ॥ ఛీ! నీతిహీనా ధ్మాతలేంద్రుని. కూతురునగు నా తెరంగెరుంగక యీతరి బల్కుచుంటివి విద్యజెప్పినవారు తండ్రి సమానులని మన్నించితిని గాని లేకపోతే నీగతి యేమౌనో.

(అని వెడలిపోవును)

పంతు-వ॥ (తనలో) ఓహో సర్వమంగళా నీ పెండ్లి నాచేతిలోనిదే కాదా నిన్ను వట్టిమూర్ఖ దరిద్రునకంటగట్టక పోయితె నాపేరు అప్పల శాస్త్రికాదు. (నిష్క్రమించును)

(2-వ రంగము ప్రవేశం - సత్యవంతుడు, నీతివంతుడు)

సత్యా-వ॥ నీతివంతా!

నీతి-వ॥ మహారాజా !

సత్యా-వ॥ మన అప్పలశాస్త్రిగారిని పిలిపించుము. అమ్మాయికి తగినవరుని జూడబనుచుదము.

నీతి-వ॥ చిత్తము. (అని నిష్క్రమించును)

(ప్రవేశం - అప్పలశాస్త్రి)

సత్యా-వ॥ వందనములు భూసురోత్తమా! రండు యీ యాసనమలంకరించుడు.

అప్పల-వ॥ దీర్ఘాయురస్తుః మనోవాంఛాఫలశిద్ధిరస్తుః. (కూర్చుండును)

సత్యా-వ॥ శాస్త్రిగారూ మా అమ్మాయికి మహానేర్పరియు విద్యావంతుడగు వరునిజూచిరా పొమ్ము.

అప్ప-వ॥ అందుకేం లెండి మీరు నాకు చెప్పవలసిన దేముంది మహావీరశూర మారసమానున్ని దెచ్చెదను. (అనిపోవును తెరవ్రాలును)

(3-వ రంగము ప్రవేశం - అచ్చిగాడు)

అచ్చి-పాట॥ యేటాకుబోదాము రబ్బిగో। నాతోటీనువ్వూరారో రబ్బిగా॥
ఓరబ్బిగా॥

అబ్బి-పాట॥ యేటంతేయేందే వో పెద్దయా । అది యెక్కడవుంతాదే
పెద్దయా । ఓ । పెద్దయా॥

అచ్చి-పాట॥ లేల్లూ కుందేల్లూరో రబ్బిగా । అడవుల్లో నుంటాయిరో
రబ్బిగా ॥ ఓరబ్బిగా॥

అబ్బి-పాట॥ యేంతోని గొడ్తారె పెద్దయా । అవి యెట్టిట్టా సిక్తాయే
పెద్దయా । ఓ పెద్దయా॥

అచ్చి-పాట॥ బానాలు యెయ్యాలి రబ్బిగా । అవి పడగానె పట్టాలి
రబ్బిగా । ఓ రబ్బిగా॥

అబ్బి-పాట॥ బానాలులేవే వో పెద్దయా । యింటి । బద్దాలు లెవ్వే వో
పెద్దయా । ఓ పెద్దయా॥

అచ్చి-వ॥ యేమైనయిరా.

అబ్బి-వ॥ నాత్రి కట్టెల్ లేకపోతే అవన్ని అవ్వ పొయిలెట్టింది.

అచ్చి-వ॥ బగ్గాబల్సింది దీంతల్లీ......అబ్బా! నే నెట్టనన్న సూస్కుంటాగ్ కాని నువ్వెల్లి కట్టెల్ తా పో.

అబ్బి-వ॥ యెల్తుండాను. (అని అడవికివెళ్ళి నొకచెట్టుపై నెక్కి తాను కూర్చున్న మండను నరుకుచుండును. యింతలో అప్పలశాస్త్రి ఆదారిని వచ్చి పైకిచూచి.)

అప్ప-వ॥ (తనలో) ఓహో! వాడు కూర్చున్నమండను వాడే నరుకుకొనుచున్నాడు యింతకన్న మూర్ఖుడు యీ ప్రపంచములోగలడా సర్వమంగళను వీనికే అంటగట్టెదగాక. (ప్రకా) యెవరు నాయనా! చెట్టుదిగి యిలారమ్ము.

అబ్బి-వ॥ యాందిరా! యెందుకు?

అప్పల-వ॥ (తనలో) ఓరీ! నీదుంపదెగ యెంత వినయముందిరా యిలారమ్ము నాయనా నీతో నొక్కవిచారము గలదు.

అబ్బి-వ॥ యేం ఆశారం యేద్వారా. (అని చెట్టుదిగివచ్చును)

అప్పల-వ॥ మీరెవ్వరు.

అబ్బి-వ॥ మేం యెరుకలం.

అప్పల-వ॥ నీకు తల్లిదండ్రులున్నారా వాళ్ళ పేరేమిటి.

అబ్బి-వ॥ ఆ ఉన్నారు అచ్చి అచ్చిగాడు.

అప్పల-వ॥ మీవూరెక్కడ.

అబ్బి-వ॥ అందే కనిపిత్తున్న బోయపల్లె.

అప్పల-వ॥ నీకు పెళ్ళయిందా.

అబ్బి-వ॥ కాలేదు.

అప్పల-వ॥ నాతోరమ్ము నీకు చక్కని పెళ్ళాన్నిచేస్తాను. (అని తోడ్కొని పోవును)

(పునః అబ్బయ్యా నలంకరించుకొని రాజ సభకు ప్రవేశించును)
రాజుతో—

అప్పల—వ॥ మహారాజా! తవ కన్యపుణ్యా విశేషమేమిటో కాని సామాన్యుల కలవిగాని వరుడు లభించాడు యిదుగో (అబ్బయ్యను చూపును)

సత్యా—వ॥ ధన్యుడను రండు కూర్చొనుండు. (కూర్చుందురు)
సత్యా—వ॥ వీరిలో యేమిలోటు లేదుకదా.
అప్ప—వ॥ ఆమాటలు మీరు ప్రశ్నించు టనవసరము.
సత్యా—వ॥ అయితే ముహూర్తము నిర్ణయించుడు.
(రాజభవనమంత వీక్షింపుచున్న అబ్బయ్యా గోడపైనున్న రామరావణుల పటముగాంచి)
(అందరు వినునట్లు) వీడు రాభనుడా. (అనును)
(రాజు మొదలగువారు నిశ్చేష్టులై చూచెదరు)

అప్పల—వ॥ యేమండీ అలా తెల్లబోయి చూచుచున్నారు వీరు మహాపండితులు అటులైన నీయపశబ్దమెటుల నుచ్చరించెనని మీ యభిప్రాయము కావచ్చు వినుండు.

శ్లో॥ కుంభకర్ణే భకారోస్తి। భకారోస్తి విభీషణే
రాక్షసానాం కులశ్రేష్ఠో। రాభణో నతు రావణః॥

వ॥ రావణ కుంభకర్ణ విభీషణు లన్నదమ్ములైనప్పుడు కుంభకర్ణ విభీషణులకు మాత్రము వారినామములలో రెండవయక్షరము భకారమైయుండ రాక్షసకులశ్రేష్ఠుడగు పెద్దవానికి భకారము లేక వకార మెట్లు వచ్చును కావున రాభనుడేయని యీసదమల పండితుని యభిప్రాయము.

సత్యా—వ॥ భేష్ పెండ్లిముహూర్తం యెన్నడో చూడండి.
అప్పల॥ యెన్నడో యెందుకు శుభస్యశీఘ్రం కానివ్వండి మంచి తరుణం మించిపోకూడదు.

(వివాహ మహోత్సవము జరుగుట)

శ్లో॥ తదేవలగ్నం సుదినంతదేవ। తారాబలం చంద్రబలం తదేవ విద్యాబలం దైవబలం తదేవ। లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥
(అందరు నిష్క్రమింతురు) తెరవ్రాలును.

(3-వ రంగము - శయ్యామందిరము)

(సర్వాభరణయై సర్వమంగళ వచ్చేవరకు అబ్బయ్య గుఱ్ఱుపెట్టుచు నిద్రించును)

సర్వ-వ॥ (తనలో) బావురుపిల్లులు పోట్లాడునట్లు గుఱ్ఱుపెట్టుచు కాళ్ళపైపు దలాపు నునిచి పడుకున్న దెవరు...(చూచి) ఓహో! నా భర్తయే యిదేమినిద్ర నొక పాటబాడి మేల్కొంచెదగాక.

పాట॥ జాగేలరా నా। స్వామీ ॥జాగే॥ జాగేలరా సంయోగంబుగూర్చి నే నోరితీ నీయోగామనంబుగ ల్గె ॥జాగేల॥ మచ్చికదీరా।ముచ్చాట లాడీ। యిచ్ఛాగక్రీడా। స్వేచ్ఛాగసల్ప వేర ॥జాగేలరా॥ మా రూనిబారీ। కోరూవజాలా। లేరాబిగీ। యారా కౌగిలియిమ్ము॥ జాగేలరా॥

వ॥ యింకా మేల్కొనడాయె యీ పరిమళగంధము పైన జిలికెదగాక. (అని గంధము చల్లినా లేవకయుండును)

సర్వ-వ॥ నాథా! నాథా! (అని చేతితో తట్టుచు లేపును)

(అబ్బయ్య లేచి మిడుతు మిడుతు చూచుచు కూర్చుండును)

సర్వ-వ॥ "అస్తికశ్చిద్వాగ్విశేషః" (అనగా చదువేమైన గలదా యనుట)

అబ్బ-వ॥ యెందీగోల సచ్చినట్టుతోంగొ నీతల్సిగ్గొయ్య.

సర్వ॥ (తనలో) అబ్బా యీతడు మహాపండితుడని గురువెంత మోసము జేసినాడు.

పాట॥ దేవా దేవా కావారావా ॥దేవా॥ యీవేళను నాకీవిభుసివిక। యేవిధినొసగితి వెటుసైరింతును ॥దేవా॥ ధర వెంకటరావ్ పురినిలయానా। దురితమదేరా। దరిజూపవురా ॥దేవా॥

వ॥ ఓహో యెవరికర్మానుసారం వారికి జరుగును యిందుకు చింతించిన నేమిలాభము నొక్కపనిజేసెదగాక.

(ప్రకాశ) నాథా పూర్వసంచితమువల్ల మనము భార్యాభర్తల మైతిమి మీరు చదువులేనివారు "విద్యాహీన నశోభంతీ" కావున నే జెప్పినట్లు వర్తించిన మీకు విద్యలభించును.

అబ్బ-వ॥ ఇద్దంటె యెట్టత్తది మరి.

సర్వ—వ॥ అదియే నే జెప్పుచున్నానుగా యీగ్రామం వెలుపల నొక కాళికాలయంగలదు ఆదేవి ప్రతిరోజు గ్రామసంచారం సేయుచుండును నీవా ఆలయములోయుండి తలుపులు బిగించుకొనుము కాళికాదేవి వచ్చి తలుపులు తీయుమనిన విద్యనొసంగితె తీసెదననుము అప్పుడాదేవి నీకు విద్యనొసంగును.

అబ్బ॥ ఆలమంటే.

సర్వ॥ గుడి.

అబ్బయ్యా—వ॥ మరాగురెక్కర.

సర్వ—వ॥ నేచూపెడుతానురండి. (అని తోడ్కొనిపోవును)

4—వ రంగము గ్రామబాహ్యము.

(ఆలయ ప్రదేశం – ప్రవేశం కాళికాదేవి)

కాళి—వ॥ (తనలో) అదుగో! నాగుడి తలుపులేమో మూయబడినవి. (ప్రకాశముగా) తలుపుతట్టి.

పాట॥ తలుపులు బిగియించి లోన నిలచినదెవరో వేగమె । తలుపులు
దీయండి వలదు తడవికగ ॥లలనవా పురుషుడవో నా । స్థలమున
జేరితివేలనొ । తెలవారగవచ్చె మానవులు దిరిగెడివేళాయను ॥

వ॥ (తనలో) వేకువజాము కావచ్చినది యెవరో నాస్థలము నాక్రమించుకొని పలుకుటలేదే.

(ప్రకా) పాట॥ వెఱగందక గర్భగుడిలో జొఱబడుటకు యెంతధీరవరులో
నేమెచ్చుకొంటి చాలగ । సరగున నీకోరికయును నెరవ్వేద
నాతోడను । పరిహాసము వలదునన్ను గురుతించుము శ్రీకాళిని ॥

వ॥ నన్నెవరనుకొనుచున్నావో నేను కాళికాదేవిని లోపలనున్న దెవరో తలుపులు తీయండి మీకు వలసిన వరము లొసంగెదను.

అబ్బయ్యా—వ॥ (లోపలనుండి) కాలీ బిడ్డె కాలీ బిడ్డె (యనును)

కాళి॥ (తనలో) అహో యెవడో మూఢభక్తుడు విద్యగురించి వచ్చినాడు. (ప్రకాశ) సరినాయనా నీనాలుకజాచుము.

(అనగా అబ్బయ్య తలుపుసందునుండి నాలుకజాచును
కాళికాదేవి అతని నాలుకపై బీజాక్షరములు వ్రాయును.
అబ్బయ్య తలుపుతీసి చేతులు ముకుళించి.)

శ్లో॥ మాణిక్యవీణా ముపలాలయంతీం । మందాలసంమంజుల వాగ్విలాసాం
మాహేంద్రనీలద్యుతికోమలాంగీం। మాతంగకన్యాం మనసాస్మరామి॥
(అని నమస్కరించును)

కాళి—వ॥ వత్సా నీవు నేఁడుమొదలుకొని కాళిదాసుండను నామముచే సకలకళా వర్ణివీఁడుండవై విశేషపాండిత్యముచే నలరారుచుందువు వలయునప్పుఁడు నన్ను ధ్యానించుము నీకుదరిశనం బొసంగెదను పొమ్ము.

కాళిదాసు॥ దేవీ ధన్యోస్మిని. (యింటికి పోవును)

—( సర్వమంగళతో వాదం )—

కాళి—పాట॥ వడసితివరములు నీదయ । వలనజనని వందనములు ॥వడ॥
కడు వేడుకదీ వెనలుఁగ నిడుమానాయడ కరుణచె ॥వడ॥

వ॥ తల్లీ నీయుపదేశాను సారంబుగా కాళికాదేవి వరములబడసి వచ్చితిని నీవుకూడా నన్నాశీర్వదించుము. (నమస్కరించును)

సర్వ—పాట॥ సతులకు వందనమనియెడి । పతులున్నర యెందైనను ॥స॥
సతతము మిము సేవించెడి । యతివనుగానా నాథా ॥సతు॥

వ॥ మనోహరా! యేమీావిపరీతము భార్యలకు నమస్కరించే భర్తలుందురా నన్నిట్లుల పరిభవించెదరు. (అనియేడ్చును)

కాళిదా—పాట॥ జ్ఞానము నుపదేశించిన దానవు జనని సమానవు ॥జ్ఞా॥
గాన వందనము లంటిని । దానదోష మేమిగలదు॥ జ్ఞా॥

వ॥ ఉపదేశమొసంగితివి కనుక నాతల్లి సమానవు యిందులో దోష మేమున్నది నన్నాశీర్వదించుము నేను దేశయాత్ర వెళ్ళుచున్నాడను. (పోవుచుండును)

సర్వ—వ॥ నాథా! నాథా (వెనుకబోవుచు)

పాట॥ నావాక్కును గై సేయక । నీ వేగుచునుంటివి సరి ॥నావా॥ నీవును
యొక అధమాధమ స్త్రీవలన మృతిఁగాంతువు॥ నావా॥

వ॥ నన్నుధిఃకరించి వెడలిపోవుచున్నావు నీవొక యధమస్త్రీవలన మరణము గాంతువుగాక. పొమ్ము. (అని తనమంబున)

గీ॥ భువిలో రాకాంతనై పుట్టి యౌవనమంద్భు । పరిణయమాడి నేనెరుగ సుఖము। యిందున్న ఫలమేమియిపుడె మునిరథాపంబు। దాల్చి వెడలుచాన దండయాత్రా॥

వ॥ యిక నాకీ యాభరణాలంకారంబులేల యెచ్చటికైన వెళ్ళి తపస్సుచేసుకొనుచుండెదగాక. (అని వెళ్ళిపోవును) తెరవ్రాలును.

5–వ రంగము భోజుని సభామందిరము (ప్రవేశం–శంకరకవి)

శంక–వ॥ రాజన్నభ్యుదయోస్తు

రాజు–వ॥ శంకరకవే, కిం పత్రికాయాం

శంక॥ ఇదంపద్య...రాజు॥ కస్య—శంక॥ తవైవ భోజనృపతే... రాజు॥ సాపఠ్యతాం...శంక॥ పఠ్యతే॥

శంక–శ్లో॥ ఏతాసామర విందసుందరదృశాం। వాక్చామరాందోళనా।

దుద్వేలద్భుజవల్లి కంకణఝణ। త్కారఃక్షణంవార్యతాం॥

భోజు॥ (చామరమువీచుచున్న పద్మాక్షినిగాంచి) పద్మాక్షీ చామర మాపుము. (దాసి యూరకుండును)

శంక–శ్లో॥ యథాయథా భోజయశోవివర్ధతే। పితాంత్రిలోకేమివ కర్తుమద్యతం। తథాతథామే హృదయంవిదూయతే। ప్రియాలకాళీ ధవళస్య శంకయా॥

(భోజుడు నవ్వి) బుద్ధిసాగరా. బుద్ధి॥ మహారాజా.

భోజు–పాట॥ యితనికిపండ్రెండులక్ష లిప్పించుము బహుమానము। అతి ముదమున బంపించుము ఆలస్యమువలదింకా ॥యిత॥

బుద్ధి–పాట॥ అటువలెనేయిప్పించెద అధిపసత్తమావినుడిక। పటుతర వెంకటరావు ప్యాటనిలయు కారుణ్యము ॥అటు॥

(అని ద్రవ్యమిచ్చి శంకరకవిని పంపించినంత ఏకసంత ద్విసంత త్రిసంతగ్రాహులుగని)

ఏక–వ॥ ఏమండోయ్ ద్విసంత త్రిసంతగ్రాహులాగా యీదిక్కుమాలిన పండితులంతా వచ్చి మనరాజుగారి ద్రవ్యాగారమంత ఖాళీ చేయు చున్నారు. యికయేపండితుడు రాజుదగ్గఱకు బోకుండా కావాలి అందుకునే జెప్పినట్టు మీరు వర్తించాలి.

ద్వి–త్రి॥ చిత్తం చిత్తమండీ.

(ప్రవేశం – కాళిదాసు) పండితులగాంచి

వ॥ నమస్కారము లండీ. పండి–వ॥ యెవరోయ్ నీవు.

కాళి–వ। నే నొక బీద బ్రాహ్మణుడను కొలదిగా కవిత్వము మాత్రము జెప్పగలను రాజదరిశనార్థమైవచ్చినాడను కనుక యిప్పించుడు.

పండి-వ॥ సరి అటులనే యిప్పించెముకాని నీకవిత్వమొకసారి మాకు విన్పించు.

కాళి॥ శ్లో॥ అస్తినద్పకవచ్చైవ । చల్లవత్ తెల్లకుక్కవత్ । రాజతేభో జతేకీర్తిః । పునః సన్యాసిదంతవత్ ॥

ఏక-వ॥ వా......యేమండోయ్ ద్విసంతతిసంతగారిహులారా.

ద్వి॥ త్రి॥ యేమండీ. ఏక॥ వీరికవిత్వ మెలావుంది.

ద్వి॥ త్రి॥ చాలాబాగుంది.......(అని నవ్వుచుందురు)

పాట-ఏక॥ ధారుణిపతి కొత్తకవుల దేరేమనియనుచుండును॥

ద్వి॥ త్రి॥ వారి సన్నిధానమునకు వీరిని గొనిపోవుదాము ॥ధారు॥
(కాళిదాసుతో) రావయ్యా! రాజుగారిదగ్గఱకి బోవుదాము.
(అని కాళిదాసును దోడ్కొని భోజరాజునుజేరి)

ఏ॥ ద్వి॥ త్రి॥ మహారాజా! యిదుగో వీరు గొప్ప పండితులు.

భో॥ పండితోత్తమా మీకివే వందనంబులు రండు యీ కనకపీఠం బలంకరించుడు. (నమస్కరించును)

కాళి-శ్లో॥ పజ్ఞామాఢ్ఢ ఖరాఢ్ఢపీఢ్ఢవ సుధా । జ్వాలాంశ్చ సాఢ్ఢాఖరే । ఢ్ఢీఢ్ఢెట్కిట్కిధరేధరే ఖణఖణా । ఖఢ్ఢూర విఢ్ఢఢ్భ్రిమా। లఢ్భ్రిం లుఢ్భ్రిమలుఢ్భ్రియపదా।పఢ్ఢస్తదా।భాదాటేటి పటేటి టేటిటేటుర సత్ప్రఖ్యాతి సత్యాదయః॥(అని యాశీర్వదించినభోజుడుసంతసించి)

భోజు-పా॥ కవిశ్రేష్ఠాధారానగరంబూ । మీ కర్పించితిగొనుడిక మోదంబూ ॥ తవసేవ యొనర్చుచుండెదను మీ సాన్నిధ్యంబున । అవనిని బాలించుడి వైభవమును మీరంగా వో ॥కవి॥

కాళి-పా॥ అవనీశ్వర తగదూ యీమాట। బ్రాహ్మణ్యము మాకెందు కీగలాటా । భువినేలగ మీకేయొప్పనుగానీ మావంటి । అవనీ సురలుణ్ పరిపాలనముసేయ రాణించదు ॥అవ॥

ఏక॥ ద్వి॥ త్రి॥ పాట॥ ఆపద్యము మేముజదువలేమా ॥ యీ బాపనితో సమము మేముగామా । భూపాలక మేమింకను వోపము నీయవమానము । ఈ పదుగురిలోన గొప్ప యిత నెందుకుజేసితిరీ ॥ఆవ॥

కాళి-పాట॥ మేదినీశయే పండితునకునూ। యిక। మీాదరిశనమును గాకుండగనూ॥ యీాదురాత్ములును కపటోపాదిని వహియించియు మీ సాదరమున బ్రతుకుచు విషపాదులుగను యున్నారూ ॥మేది॥

భోజు–పా॥ ఛీఛీ కపటాత్ములార మీరూ । యిల యాచకులకు శత్రువు
లై నారూ॥ నాచేమన్ననలింకను నోచుకోరు మెచటికైన। వేచను
డింకను యుంటే వ్యర్థము శిక్షను బొందెదరు ॥ఛీఛీ॥

వ॥ దురాత్ములారా! నా సముఖంబున నుండక తక్షణమే వెడలి పొండు. (పండితులను వెడలించి గాళిదాసును గాంచి)

వ॥ మహాత్మా! తామింకెచ్చటికి వెళ్ళక నాయా స్థానంబునేయుం డుడు మిమ్ములను పరమేశ్వరు భావముతో జూచువాడను.

కాళి–వ॥ మహారాజా! మీ యిష్టానుసారముగా యిచ్చటనే యుండువాడను.

మంగళహారతి.

1. హారతిగైకొనుము భక్తివిూర నొసగు వారము యో మారుతాత్మ
జ నీపదయుగళవారి జంబులన్ । కోరియు వినుతింతుము । నిను ।
గొలచుచున్ భజింతుమూ । దారిద్ర్యాబ్ధిని దాటగా ॥ కారుణ్యానిధి
మాదుష్కర్మములను తెగగోసి య! పార శుభములన్ నొసంగు
వీరాగ్రేసర జయుజ ॥హారతి॥
2. సీతజాడ లలరయగ లవణసేతువులంఘించిదనుజ । నాతినైమెసలంఖిణిని
ఘాతజేసియున్ । పాతకులౌదనుజులన్ । పలువురన్ వధించియున్ ।
సీతనుగని రాముచేతి యుంగరం । ప్రీతితోడ నొసగి రాముడే తెంచు
నటంచుదెల్పి । ఖ్యాతిగవన మంత విఱచి కావలులను గొట్టినవట॥
3. దనుజేంద్రునియానచేత దనుజులు నీతోకకగ్నియును దవిలింప లంక
నంతయును వేగాల్చియున్ । యినకులపతిదలచియున్ । వనచరులను
గలసియున్ । జనిరాముని గొని పోయిదశాననున్ । దునుమాడియు
యానైదేహిని రామునకొప్పగించి । పనిగను వెంకటరావుప్యాటలో
వసియించినావు ॥హారతి॥

ఇది శ్రీ రంగనాయకుల వెంకటార్య ప్రణీతంబైన భోజకాళిదాసు నాటకమందలి పంచమాంకము సమాప్తము. శ్రీ శ్రీ శ్రీ

సర్వము శ్రీ కృష్ణ చరణార్పణ మస్తు॥
ఓంశాంతిః శాంతిః శాంతిః

---

కొండా శంకరయ్యగారి శ్రీమియుర్ పవర్ ప్రెస్, సికింద్రాబాద్.